# అహల్యాగౌతమము

[పద్యకావ్యము]



కృతికర్త:

బులుసు వేంకటేశ్వర్లు, బి. ఏ.



1949
కాకినాడ

మూల్యము రెండురూపాయలు

తొలికూర్పు :

విరోధి : వసంతము

టి. పి. 80/4

సూచన :

౧౬ పుట ౨ పంక్తి 'గ్రహింప'; ౭౮ పుట 3, ౪ పంక్తులు 'బెండ్లిన్'; ౮౧ పుట ౬ పంక్తి 'విలసిల్లుదు'; ౧౦౦ పుట ౯ పంక్తి 'పాద్యంబు' అని చదువుకొనునది.

# నివేదనము

శ్రీమదాంధ్రసారస్వతమున ధర్మప్రతిపాదకము లగు కావ్యము లెన్నియో కలవు. ఇంచుమించి వన్నియు శృంగారరసప్రధానములు. ఈశృంగారము ధర్మశృంగార మగుట నీకావ్యము లన్నియు సర్వజనపఠనయోగ్యములుగ నే యున్నవి. కాని, రానురాను దమ్ముఁ బోషించు ప్రభువుల యభిరుచులఁ బట్టి కొందఱుసామాన్యకవు లధర్మశృంగార మును నిషేధింపక కొన్నిప్రబంధములఁ గల్పించి తాత్కా-లికకీర్తిఁ గాంచఁగల్గిరి. ఈయధర్మశృంగారప్రధానము లగు కావ్యములలో శశాంకవిజయము, అహల్యాసంక్రందనము నెన్నికఁ గన్నవి.

అహల్యాసంక్రందనమువిషయమునఁ జాల రాద్ధాంత 'ములు వెలసినవి. అహల్యాయై జారః' యని బ్రాహ్మణ మునఁ గలదానికి శ్రీవిద్యారణ్యు లేమియు భాష్యమున వ్రాయలేదు. అహల్య యనఁగాఁ జీకటి యనియు నింద్రుఁ డనఁగా సూర్యుఁ డనియుఁ గుమారిలభట్టు తెలిపి యీకథ సాంకేతిక మని నిర్ణయించెను. అహల్య యనఁగా నూషర క్షేత్ర మనియు నది యింద్రసమాగమమువలన ననఁగా వర్ష జలముచేఁ దడిసి ఫలించుట యనియు మఱియొక వైదికనిర్వచ నము. ఈపై నిర్వచనములే యథార్థము లనియు వీని కపార్థ ములు తోఁచుటవలనఁ బురాణములలో నీకథ లసభ్యముగా జిత్రింపఁబడిన వని మీమాంసకుల నిశ్చితాభిప్రాయము.

ఏమైన నేమి యతీంద్రియదృష్టి లేని సామాన్యప్రజానీక మున కిట్టియధర్మశృంగారగ్రంథము లవినీతిఁ బ్రేరేచుననుట సత్యమునకు సన్నిహితము. తా నెట్లు వర్తించినను నరుఁడు 'సత్యం వద ధర్మం చర' యని యుద్బోధించుటయే యార్య సాంప్రదాయము. ఈదృష్టియే భారతవాఙ్మయాదర్శము.

కావున, నుత్తమపతివ్రతలలో నొక్కతెయై ద్రౌపది, సీత, తార, మండోదరి- వీరితోఁ గూడి పంచకన్యలలోఁ బ్రథమగణ్యయైనయహల్యాసాధ్వికిని బ్రహ్మర్షి శేఖరుఁ డగు గౌతమమహర్షికిని నగ్నిసాక్షిగ నైనవివాహాదివృత్తాంతము, వారియాదర్శసాంసారికజీవనము, వారు లోకమున కొనర్చిన మహోపకృతులు, వర్ణించితిని.

అహల్యాగౌతముల పవిత్రజీవనకథ ధర్మశృంగార ప్రధానమై ధర్మార్థకామమోక్షప్రదమై మహోత్కృష్టకావ్యవస్తువైయుండఁగా దీనిని విడిచి యహల్యాసంక్రందనకావ్యములఁ గూర్చినవారిదురదృష్టమునకు వగచి నా కీసంకల్పము కలిగినందుల కానందించి నే నీకావ్యమును రచించితిని.

ఇందుఁ బలుతావుల యథోచిత మగుకల్పనలఁగూర్చితిని. సంకల్పించిన నెలదినములలోనే కావ్యము పూర్తియగుటయు వెంటనే ముద్రిత మగుటయు నే నూహింపకుండనే జరగినవి. ఈగ్రంథము నింతసుందరముగా నాలుగుదినములలో ముద్రించి యిచ్చి నే నిచ్చినది పుచ్చుకొని సంతసించి నాయందుఁ గవితయందు నమితాభిమానముఁ జూపిన మామిత్రులు శ్రీమాస్టర్మన్ముద్రాశాలాధిపతులు శ్రీపోతాప్రగడ కృష్ణమూర్తి బి. ఏ. గా రెంతయు నభినందనీయులు.

నాయీకావ్యము రసికవరుల మన్ననఁ బడయక పోదని విశ్వసించుచున్నాను.

ఇట్లు

| | |
|---|---|
| కాకినాడ | విబుధ విధేయుఁడు, |
| విరోధి: వైశాఖ బ ౧౩ | **బులుసు వేంకటేశ్వర్లు.** |
| సౌమ్యవాసరము | సంపాదకుఁడు, 'వావిళ్ల నిఘంటువు,' |
| 25—5—49. | ఆంధ్రాధ్యాపకుఁడు. 'పి.ఆర్. కాలేజి' |

శ్రీగురుభ్యోనమః

# అహల్యాగౌతమము

—∞∞—

## పీఠిక

శ్రీ వాణీపతి సృష్టిచేయు నెడలన్;
శ్రీవిష్ణు వీసృష్టి సం
భావార్హంబుగఁ బెంప; నీశ్వరపద
ప్రఖ్యాతుఁ డేతద్వినా
శావాప్తిం బొనరించువట్లు; నగుబ్ర
హ్మజ్ఞాని నస్మద్గురు
శ్రీవిశ్వాత్ముని భక్తిఁ గొల్చి నిజహృ
త్పీఠిం బ్రతిష్ఠించెదన్. ౧

చ. పలుకులకల్కిక్రమ మగు
పల్కులకైనను జేఁదుపుట్టు నే
సలలితరూపసద్విభవ
సంగతిఁ జెప్పఁ గడంగుచోఁ దదం
ఘ్రులకొనగోటికిన్ సరిన
ర్చన్ భువిఁ గానఁగఁజాల మట్టిశ్రీ
లలితుని సత్తపోవ్రతఫ
లప్రదుఁ గొల్చెద మద్గురూత్తమున్. ౨

చ. జగములఁ గావఁ బ్రోవఁ దగు
సజ్జనపాళిని, హేతుజన్ముఁడై
త్రిగుణతఁ బూనుచున్ మఱి య
తీతుఁడు నౌచు నరత్వ దేవతా
త్వగుణచరిష్ణు వౌచు సము
దగ్రకృపన్ మముఁ బ్రోచుచున్నయా
సుగుణుని మద్గురున్ మృదువ
చోమృతసిద్ధికి సంస్తుతించెదన్. ౩

ఉ. తల్లుల నెల్లలోకులకుఁ;
దండ్రులు మువ్వురుమూర్తు లాజగ
ద్వల్లభులన్, గణేశముఖ
భవ్యుల, దేవగణంబులన్ గృపా
సల్లలితేక్షణార్థి నయి
సమ్మతిఁ గొల్చి మహాప్రతిష్ఠవా
గ్వల్లభు లాంధ్రసంస్కృతజ
గత్కవితల్లజులన్ భజించెదన్. ౪

చ. ఇహపరకామ్యసిద్ధికయి
యీకవితాపర దేవతామహా
మహిమము నూహచేసి బహు
మంజులవాక్సుమపూజచేతఁ బ్ర

త్యహాముసు నాత్మధన్యతయు
నాంధ్రమహాజనధన్యతక్ సుదు
స్సహాముగఁ గాంచి కూర్చిన ల
సత్కవియోగుల నాశ్రయించెదన్. ౫

మ. సరసుల్ మెచ్చఁగ వ్రాసితిక్ దొలుత "స
ష్టావక్రచారిత్ర" మా
దరణీయం బగుబ్రహ్మచర్యము గృహ
స్థస్వీయధర్మంబు మే
దురదీక్షాపరిపాలనాదిగుణసం
దోహప్రకీర్త్యంబుగా
గురుదేవాంకితమై యశోగరిమముక్
గూర్పంగ నాకద్దియున్. ౬

మ. అమితంబై సకుతూహాలంబున "సహా
ల్యాగౌతమ" ఖ్యాత ము
త్తమకావ్యంబు రచింపఁగాఁ గడఁగి మో
దంబార నస్మద్గురుక్
ప్రమదాంతఃకరణుం గృతీశ్వరు నొన
ర్పం గాంచి ధన్యుండనై
సముదగ్రం బగుతత్కటాక్షమునకుక్
సంధింతు భక్త్యంజలిన్. ౭

ఉ. దంభగుణాదికంబులను
దగ్ధ మొనర్చినయజ్వనైన; సం
రంభముఁ జూపి వీరమ్రుతి
మాన్యతఁ గాంచినవీరునైన; నా
రంభ బహూకరించుఁ బరి
రంభణదివ్యసుఖానుభూతి; ను
జ్రుంభకవిత్వకాంత వరి
యించుఁ దలంప రసజ్ఞశేఖరున్.

మ. భవబంధంబుల బాపఁజాలి పరమ
ప్రాప్యంబు నందీయ నీ
భువిపై నవ్యయమోదహేతువయి స
మ్మోహజ్వరధ్వంసియై
యవలన్ మోక్షపదం బొసంగి తుది బ్ర
హ్మైక్యానుసంధాయకం
బవుకావ్యంబు నుతింప శక్యమె మహా
హ్లాదప్రదం బౌటచేన్. ౯

ఉ. పూతచరిత్ర మొక్కటి య
పూర్వమనోహరరీతి వ్రాయఁగా
నాతలఁ బొవు నోవ దని
నా కొకశంకయు లేకపోవ ను

ద్భూతకవిత్వధార యిటు
ప్రాల్పెసలారఁ గడంగినాఁడ న
న్నాతతవత్సలత్వమున
నారయుఁడీ కవులుఁ రసజ్ఞులున్. ౧౦

మ. అతిలోకం బగుప్రాతజీవని యుహా
ల్యాసాధ్వి; మాన్యార్యశా
శ్వతధర్మజ్ఞుఁడు గౌతమర్షి; బహుధా
శ్రావ్యంబు సత్కావ్యస
త్కృతతత్పావనజీవనోన్నతి; లస
త్కీర్త్యంబుఁ దద్ధర్మసం
గతి; కానన్ గణనీయమై వెలయు మ
త్కావ్యంబు రమ్యంబుగన్. ౧౧

ఉ. ఆతనియాజ్ఞ లేక తృణ
మైనఁ జలింపదు కాన నాకు న
య్యాతని సత్కృపామృత మ
హత్త్వము తోడగుఁగాక నిత్య మ
త్యాతత శబ్దసంపదయు
నంచితమార్దవసౌకుమార్య సం
ఘాతము సత్కృపన్ ననుఁ బ్ర
గాఢముగా వరియించుఁగావుతన్! ౧౨

మ. పటువిజ్ఞానవిశారదుండు నిగమ
ప్రాజ్ఞుండు నధ్యాపనో
త్కట దీక్షుండు ననేకశిష్యపరమో
త్కంఠుండు శ్రీగౌతమో
తట దేశోజ్జ్వలజీవనుం డయి లస
ద్ధన్యాత్ముతం జన్న వేం
కట సుబ్బయ్యను మత్పితన్ బరమవి
ఖ్యాతుం బ్రశంసించెదన్. ౧౩

ఉ. కమ్మని తెల్గుబాస నుడి
కారము నాకు సుఖమ్ము గాఁగఁ బూ
తమ్ముగనుగ్గుఁ బాలను ను
తమ్ముగఁ బెట్టినపుణ్యసాధ్వి యే
యమ్మ సదాశివాత్మజ మ
హార్యపతివ్రత యట్టియన్నపూ
ర్ణమ్మను మాతృదేవత న
నంతగుణాఢ్యను సన్నుతించెదన్. ౧౪

ఉ. మన్ననతోడ నేను బది
మందిజనంబులలో మెలంగఁగా
నెన్నికఁ గాంచఁ గారకులు
నీడ్యబుధేంద్రులుఁ బుణ్యులైనవి

ద్యన్నుతు లస్మదగ్రజులు
భక్తిఁ దలంచెద వారి ముప్వురన్
విన్ననువొప్ప నన్ను నతి
విస్ఫుటభంగి సమాదరించుటన్. ౧౫

మ. గురుభక్తిన్ గురుభక్తిరాజితుల ను
త్కృష్టాత్ములన్ బుణ్యమ
ద్గురుభక్తవ్రజమున్ మహాత్ములఁ గడుం
గోర్కిం బ్రశంసింతుఁ ద
ద్వరభక్తస్మరణంబు మద్గురువర
ప్రహ్లాదమౌఁ గానఁ ద
ద్వరసంపన్నులు బ్రహ్మభాజన లస
ద్ధన్యాత్ములై యొప్పుటన్. ౧౬

షష్ఠ్యంతములు.

క. ఇహపరసుఖములు మాకహ
రహమును బ్రాపింపఁజేయు రమ్యాత్మునకున్
బహువిధవిద్యల నెల్లర
నహహా యనిపించుపండితాఖండునకున్. ౧౭

క. యోగత్యాగజ్ఞానవి
రాగప్రభుఁడై నమానిరాట్టునకున్ సు

శ్రీగుణగణశోభితునకు
రోగతమోదూరభాస్కరునకుఁ గుణికిన్. ౧౯

క. కలికాలదోషహరునకు
సలలితరూపాదిరూప సౌభాగ్యునకుఁ
వలిమలయుల్లనిరూపున
కలఘుతరత్యాగనిధికి నార్యార్యునకున్. ౧౯

క. కనఁగన్నవారి కెల్లను
ఘనమోక్షపదంబు నొసఁగు కారుణికునకుఁ
వినఁగన్నవారి కెల్లను
జననుతచారిత్రుఁడైన సర్వజ్ఞునకున్. ౨౦

క. శోకవ్యాకులతాదులు
నేకొఱఁతలు నుడిపి భక్తబృందమును సదా
యాకాంక్షఁ బ్రోచుచుండెడి
లోకాతీతునకు జ్ఞానిలోకవిభునకున్. ౨౧

క. తన్నెఱిఁగినమిన్నలకును
బున్నెంబులప్రోవు లొసఁగుపురుషాగ్రణికిన్
గన్నంతన విన్నంతన
నెన్నఁగ జన్మంబు లుడుపుబుషివర్యునకున్. ౨౨

క. విజ్ఞానము సుజ్ఞానము
ప్రజ్ఞానము నాది యైనబహువిధములబ్ర
హ్మజ్ఞానము రూపందిన
విజ్ఞానికి సకలలోకవిభవాకృతికిన్. ౨౩

క. జ్ఞానానందము మఱియో
గానందంబును దలంప గానానందా
ద్యానందంబుల నిధికిఁ జి
దానందస్వస్వరూప హర్యక్షునకున్. ౨౪

వ. హృదయపూర్వకనివేదనపురస్సరంబుగా నస్మదభ్యు
దయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన "శ్రీ
మదహల్యాగౌతమ" మహాకావ్యంబునకుఁ గథాక్ర
మం బెట్టి దనిన : ౨౫

---

శ్రీగురుభ్యోనమః

# అహల్యాగౌతమము

—:o:—

## ప్రథమాశ్వాసము

—♦ కథాప్రారంభము ♦—

చ. పరమపవిత్రమై సకల
భాగవతామలసేవ్యమానమై
నిరుపమభక్తియోగమున
నిచ్చలు వెల్గుమునీంద్రచంద్రస
త్పురుషనిధానమై బహుళ
పుణ్యమయం బగుక్షేత్రరాజమై
పరగును నైమిశంబు భువి
భారతతాత్త్వికకల్పవృక్షమై. ౨౬

సీ. నిత్యతపోవ్రతసత్యధనాఢ్యులౌ
పెక్కురుమునిజను లొకక్కచోట
పవనపర్ణాంబువుల్ తవుమాత్ర భక్షించి
ధ్యాననిమగ్నులౌ మాను లొకట

శమదమసంపదల్ యమసత్త్వ తేజముల్
వహియించు మునిరాణ్నివహము నొకట
అంగుష్ఠమాత్రపూతాంగులై తపము స
ల్పెడువాలఖిల్యులు పాడమ నొకట

గీ. ఉగ్రతాపసులను దివ్యవిగ్రహులను
నాకసంబును జేరి నాకౌకసు లతి
భక్తి వెలయఁగ నీక్షించి పడయుచుందు
రతులదివ్యానుభూతి సన్నుతు లొనర్చి. ౨౭

క. "గణియించినపుణ్య మను
క్షణమును నశియించు మనకుఁ గన వారలకుఁ
గుణితం బగుఁ బుణ్య మను
క్షణమును" నని వంతగంద్రు సర్వసుపర్వుల్. ౨౮

సీ. ఒకసారి గాలి పీల్చుకొని మున్నాఱేండ్లు
తపము సల్పినమహాధన్యుఁ డితఁడు
ఒకమాఱు జలపాన మొనరించి పెక్కబ్ద
ములు ధ్యానమగ్నత సలరె నితఁడు
ఒకకాలిమీఁద నిల్చుండి సహస్రవ
ర్షము లుగ్రతపమును సలిపె నితఁడు
ఒకపర్ణమును దిని యొకనూఱువర్షముల్
భక్తి జయించినపుణ్యుఁ డితఁడు

గీ. అతఁడు శతసహస్రాబ్దపర్యంతకాల
మస్ఖలిత మైనబ్రహ్మచర్యంబు నిలిపె
ననుచు ననుచును బేర్వేర నరయఁ జూపు
కొనుచు సురలు నుతింతు రామునివరులను. ౨౯

క. ఉగ్రతపంబులఁ గొందఱు
నుగ్రవ్రతనియతిఁ గొంద ఱుగ్రధ్యాన
ప్రగ్రహులు కొంద ఱతులస
మగ్రజ్ఞానులు తలంప నందఱు నచ్చోన్. ౩౦

చ. నిరుపమనిష్ఠతోడ నట
నిత్యము బ్రహ్మఋషీశు లెల్లఁ ద
త్పరత నకామ్యకర్మములు
భక్తి నొనర్తురు; నిత్య మచ్చటన్
జరగుమహాధ్వరంబులకు
సర్వసుపర్వులు నింద్రుఁడున్ బర
స్పరబహుభక్తియుక్తులను
వచ్చి గ్రహింతురు యాగభాగముల్. ౩౧

మ. సురనాథుం గవగూడి దేవతలు చ
క్షుఃప్రీతి నిట్లిక్కడే
యిరుప్రొద్దుల్ నిరతంబు నుందురుగదా!
యింకెక్కడో స్వర్గ మా

పరలోకంబున నుండె నంటఁ దగునా ?
భర్గుండు నీప్రాంతమం
దరయుఁ బౌరజనంబులుఁ నగజతో
నానందియై నిత్యమున్. 32

క. వలిమలయల్లుసితిలపైఁ
బోలు పగునాచంద్రమసునిపోలు పగుజ్యోత్స్నల్
మలయుటఁ దీవ్రాతప మా
స్థలమున హృదయంగమప్రశాంతత నొప్పెన్. 33

క. తనపతి నిరంతరంబును
దనగృహమును వీడి యిచటఁ దనరుటచే నిం
ద్రునిసతి శచి తక్కుఁగఁ బా
వననై మిశమును నుతింత్రు ప్రజ లెల్లపుడున్. 34

ఉ. ద్వాదశవార్షికం బగుశు
భప్రదసత్రమహాధ్వరంబు న
చ్చో దయివాఱ మౌనితతి
సూతముఖోద్గతదివ్యభవ్యల
క్ష్మీదయితాకథామృతవి
శేషమహానుభవంబునఁ శుభా
పాదకగౌతమర్షి కథఁ
బ్రస్ఫుటభంగి నెఱుంగఁ గోరుచున్. 35

క. సూతునిఁ గనుఁగొని యడిగెను
ప్రీతి ముఖాంబుజములందుఁ బెంపొందఁగ వి
ఖ్యాత మగుశ్రీయహల్యా
గౌతమవై వాహికాదికథఁ దెలుపంగన్. 36

చ. కథనకళాప్రపూర్ణుఁడు వి
కస్వరమానసరాజహంస ని
ర్మథితమదాభిమానుఁడు న
మందమరందలసత్త్వవాహను
ప్రథితవచోముఖాంబుజుఁడు
వ్యాసమహాత్మపవిత్రశిష్యసం
ప్రథముఁడు సూతమౌనిప్పుఁడు
పల్కె నుదంచితవాగ్విచిత్రతన్. 37

గీ. అమలమానీంద్రులార! మీ రడిగినట్టి
గౌతమర్షి చరిత్రంబు కడుమహత్త్వ
కలిత మది కౌతుకశ్రీలు కడలుకొనఁగ
గురుకటాక్షంబువలన వాక్రుత్తు వినుఁడు. 38

ఉ. వ్యాసపరాత్పరుణ్ బరమ
పావనతేజుని సంస్మరింతు స
న్నేసమయంబునందుఁ గృప
యింపెసలారఁగఁ బ్రోదిసేయ ను

ల్లాసముతోడ వాంఛితఫ
లంబు లనుగ్రహింప ; నే నుప
న్యాసమొనర్తుఁ దత్కృప ని
రంతరముం గనుఁ జేరియుండఁగన్. ౩౯

ఉ. గోతమవంశసంభవుఁ డ
ఖండితతేజుఁడు తర్కరత్నవి
ఖ్యాతుఁడు గౌతమీజనన
కారి యనన్యతపోధనుండు ని
ర్ధూతసమస్తకాముఁడు వి
ధూతహృదంతరశత్రుఁ డాయహ
ల్యాతరుణీమణీపతి మ
హాత్ముఁడు గౌతమదేవుఁ డెన్నఁగన్. ౪౦

మ. తనతర్కంబునఁ బూర్వపక్ష మనుగా
థం ద్రవ్వ్యో వ్యాసుం డటం
చును గ్రోధావిలమానసుం డయి తనుం
జూడంగ నేతెంచువ్యా
సుని నేత్రంబులఁ జూడ నొల్లక పద
స్ఫూర్త్యాత్ముఁడై కాంచి పే
ర్గనెఁ దా 'నక్షపదుం' డనంగఁ దలఁపం
గా నౌనె యేతత్కృతుల్. ౪౧

చ. అతనివివాహాగాధ పర
మాద్భుతమై చెలువారు సావధా
నత వినుఁ డద్ది యీత్రిభువ
నంబులవారికి శ్రవ్యమై సమం
చితపురుషార్థహేతు వయి
చిత్రవిచిత్రమునై యెసంగి వి
శ్రుతమహనీయమై వినఁగ
సొంపును నింపును నింపు రమ్యమై. ౭౨

మ. తొలుతన్ విష్ణువు క్షీరసాగరమునం
దున్ బుట్టుపీయూషమున్
ఖలు లారాక్షసు లెల్లఁ గైకొనకయుం
డన్ దేవతల్ కైకొనం
దలఁపుం బూని తదీయసిద్ధికయి కాం
తారూపముం గాంచి ని
స్తులసౌందర్యముతోడఁ బొల్పెసఁగె న
చ్చో మోహినీరూపతన్. ౭౩

మ. సురలే కాదు జగత్త్రయంబునను సం
శోభిల్లువా రెల్లరున్
బురుషుల్ స్త్రీలును బాలవృద్ధులును నా
పుణ్యాంగనామోహరూ

పరమాత్మ్యంబున కాసచేసిరి ; మహా
భావుండు శ్రీశంకరుం
డురుయత్నంబున వెంట నంటి పలుపా
ట్లొందెన్ దదర్థంబునై. ౧౧

ఉ. ఎల్లరు నేకకంఠమున
"నేమని చెప్పుదు మిట్టిరూపసం
ఫుల్లత యింతసుందరత
ముద్దుఁదనం బిది యింత యింతస
ద్వల్లభతాద్భుతద్యుతియుఁ
బ్రాభవముం గన, నెన్నఁడైన వా
గ్వల్లభుఁ డిట్టికాంతను సె
బాసన సృష్టి యొనర్పఁజాలెనే? ౧౨

క. చప్పన చప్పన చప్పన
చప్పన యాబ్రహ్మసృష్టి చప్పన నిజ మీ
యొప్పులకుప్పను బోలిన
యప్పడఁతిక సృష్టిచేయ నజునివశంబే! ౧౩

గీ. తరుణసౌందర్యరూపసందర్శనముల
మధురమోహనముగ్ధతామార్దవముల
ధాత యే యేల యాతనితాత కూడ
నిట్టిసుందరి సృష్టించి యొసఁగలేఁడు." ౧౪

క. అని చెప్పుకొనఁ దొడంగిన
విని నల్వయు ఖేదసహితవిహ్వలచిత్తం
బున నెరియఁజొచ్చె నేమని
నినిపింతును విశ్వకర్త విన్నఁదనంబున్. ౭౮

ఉ. "అక్కట! సర్వసృష్టియు న
హంకృతిమై నొనరించి యీడు లేఁ
డెక్కడ నాకు నెవ్వఁ డని
యెంచి చెలంగుచు నున్న నన్నుఁ బెం
పెక్కినదుఃఖమున్న నతి
హీను నొనర్చెను మోహినీత్వమున్
గ్రక్కునఁ జూపి విష్ణు
వధికంబుగ నన్ను జనుల్ హసింపఁగన్." ౭౯

క. నే సృష్టి చేసినంగద!
భాసిలఁగాఁ జేయఁ దాను బరిపాటి మెయిన్
నా సుందరసృష్టిం గడఁ
ద్రోసి యతఁడు కాంచె సర్వతోముఖకీర్తిన్. ౮౦

క. మోహినికంటెను సుందర
మోహనరూపంబుతోడి ముగుదనొకతె నే
నూహించి సృష్టిచేసియె
యూహాతీతంపుఖ్యాతి నొంది యెసఁగుదున్. ౮౧

క. అని బుద్ధిపుట్టఁ జతురా
ననుఁడు కడంగెఁ ద్రిలోకనారీనికరం
బున నీడు లేని సుదతిఁ
దనచతురత నెల్లఁ జూపి తగ సృష్టింపన్. ౫౨

సీ. అప్సరోవనితలయందంబుఁ దలపోసి
యిది చాల దని యెంచి యీసడించు
సురగాంగనామణీసురుచిరలావణ్య
మెంచి మెచ్చక చప్పరించుఁ బెదవి
నరలోకసుందరీవరజాతి నూహించి
యింతియేనా యని యెంచి విడచు
దేవకన్యకలను దిలకించుఁ దిలకించుఁ
జాలమిఁ దలపోయుఁ జప్పరించు

గీ. గరుడగంధర్వయక్షకిన్నరగణముల
వాసి గన్నట్టి సౌందర్యవతుల నెంచి
తనకు సంతృప్తి యేమియుఁ దనుకకునికి
మరలఁ జింతించు నావిలమానసుఁ డగు. ౫౩

సీ. పరిఫుల్లపద్మాళిపసఁ దీసి మోమున
కిది చాల దని యింక హెచ్చుసేయు
సంపూర్ణపూర్ణిమాచంద్రబింబముఁ గొని
యిది చాల దని పెట్టు నింతమెఱుఁగు

పరమప్రశస్తసువర్ణవర్ణముఁ జేసి
యిది చాల దనుచు గుణించును జిగి
కంబుకుందును లేనికాంతిని గొనితెచ్చి
యిది చాల దనుచు నూహించు మఱియు

గీ. ఇటులు తలపోసి తలపోసి యేర్పరించి
యెల్లలోకంబులందును నీడులేని
గోము గీమును గలయట్టి లేమమోము
చేసి చూచి యబ్బురపడుఁ జెంగలించు. ౨౪

మ. పొడకట్టం దలపోయు సృష్టిని నితః
పూర్వంబునం దింతకె
క్కుడు సౌందర్యముఁ గాంచినట్టి మొగ మే
కోశంబునందైన నే
ర్పడెనా యంచును లేదు లే దనుచుఁ దోఁ
పన్ మోహినీరూపమున్
గడు రూపించు బలే సెబా సనును నా
నందించు నుత్కృష్టతన్. ౨౫

క. కరచరణాదిక మగుబహు
సురుచిరకమనీయదివ్యశోభేంద్రియముల్
పరిపరివిధములఁ గనుఁగొని
యరయున్ దుది కెన్ను సృష్టియం దతిశయతన్. ౨౬

సీ. తరుణీమణీకరద్వంద్వంబు నెలకొల్ప
నలమృణాళము లెన్ని యూడుగఱచు
లతికావళీపరిస్థితు లెంచి నిట్టూర్చి
చాలునా యను ప్రశ్నఁ జాల వనును
మార్దవంబును రూపమరఁ దాల్పఁగాఁ జేసి
యిది చాల దనుచు నూహించి పెంచు
మరల మోహినిరూపతరుణతఁ దలపోసి
మేలు మే లిది యని మెచ్చుకొనును

గీ. కరములకె కోటివిధములఁ గాంచి యెంచి
చేసె నన్న నితరము లౌచెన్ను నలకు
నెన్నిమార్లెన్ని ప్రాశస్త్య మెంత చూచి
వనితఁ జేయఁగడంగెనో వనజభవుఁడు ! ౫౭

ఉ. సృష్టి యొనర్ప నాజనన
సిద్ధమహాప్రతిభాన్వితుండు, త
త్సృష్టిని స్త్రీప్రపంచము వి
శేషవరిష్ఠము సుందరంబు, నా
స్రష్ట తలంచి యెంచి కడు
శ్రద్ధ వహించి త్రిలోకసుందరీ
సృష్టి యొనర్చె నన్న నిఁక
శేముషి చాలునె దాని నెన్నఁగన్. ౫౮

ఉ. ఏయుగమందుఁ గూడ నిటు
లింతమనోహరరూపయౌవనా
ప్త్యాయుతఁ గన్నసుందరిని
సంచితరూపను గాన సంచు దీ
ర్ఘాయురుపేర్మిఁ దా నలువ
యద్భుతమందె నటన్న మోహినిన్
బాపుఁగ మించుఁ గాంత యని
పల్కినచోఁ బునరుక్తిదోషమా. ౫౯

ఉ. అంద మపూర్వరూపమును
నందె ననం జనుసుందరిం గనన్
డెందము జల్లనన్ నలువ
నేత్రములం దగ నమ్మృగజాలకిం
దం దరుణత్వమున్ గదుపె
డంగు మనోజ్ఞత రూపుగన్నయా
సుందరి వందనంబున వ
గుం బొనరించుకొనెన్ విరించినిన్. ౬౦

మ. తనసంకల్పము సిద్ధిపొందె నని యు
త్యంతానుమోదంబుతోఁ
గని "బిడ్డా! నిను సృష్టిచేసితి జగ
త్కల్యాణ మాసించి నీ

వును నన్ దంౘ్రడిగ వాణిఁ దల్లిగను సం
బోధించుచున్ యోగ్యవ
ర్తన వర్ధిల్లుము మంగళం బగును గాం
తా! నీకు నెల్లప్పుడున్". ౬౧

చ. అనుచు విరించి వాణికిఁ బ్రి
యంబున నామెను జూపి "దేవి! నీ
యనితరవత్సలత్వమున
నస్మదభీష్టఫలంబును నైనకాం
తను గ్రహియింపు పుత్త్రికగ
ధన్య నొనర్పు మపూర్వశిక్షణం
బునఁ బదునాల్గులోకములఁ
బోలిక యీమెకు లేకయుండఁగన్. ౬౨

గీ. చెలువ! త్రిభువనసుందరీసృష్టియందు
నీమె తలమానికం బయి యెసఁగవలయు
నమృతమయ మైననీహస్త మమరదేవి
పేలవము కాదె! నాసృష్టి ప్రియ! తలంప. ౬౩

క. ఎఱుఁగుదువు నాతలంపుల
నెఱుఁగుదువు సమస్త మీవు నెఱుఁగని దున్నే?
యెఱిఁగి యిఁకఁ దీర్చి దిద్దుము
కఱదుల నీకన్య నింకఁ గ్రమశిక్షణచే. ౬౪

క. హాల్య మగుఁగాక! జగములఁ
దుల్యతఁ గనఁజాల కీమెతో స్త్రీతతి సా
కల్యము సార్థకనామ మ
హాల్య యనం బరగుఁగాత మతివరుఁ దరుణీ! ౬౫

చ. నిజముగఁ దెల్పుమీ యిపుడు
నీరజనేత్ర! యహాల్యకుం గనం
ద్రిజగములందు నున్నదియె
దీటు తలంపఁగ నెందునైన నా
సృజనము మోహినీత్వమును
జెంవినవిష్ణునిసృష్టికంటె న
క్కజముగ మిన్నయేకద! ప్ర
కాశతఁ బల్కు మసంశయంబుగన్". ౬౬

చ. అన విని యాసరస్వతి ప్రి
యుంబున నాథుతలం పెఱింగి మ
న్ననమెయి "నాథ! సంతసము
నామదిఁ గూర్పఁగ నీవె నన్నని
న్నను గృపమీఱఁ బుత్త్రికగ
నాకు నొసంగితి వీమెకంటె చే
యనువున నెట్టిసుందరియు
నారయ లొచ్చె యగుఁ మనోహరా!

గీ. మోహినియె యేల యెందఱుమోహినులను
గలిపి పోల్చి చూచినఁ దీసికట్టై యగుదు
రరయ నీమెకుఁ; గలుగ నీయాదరంబు
గడ్డిపఱకకు మేరువుఘనత రాదె? ౭౮

క. దయదలఁచి నీవు నన్నిటు
ప్రియములు పల్కితివి కాని ప్రియ! నీ కెటు లే
నయమునను సాయపడఁగల?
దయదలఁచిన నీవు బ్రతుకుదానను గానే? ౭౯

శా. నీయాజ్ఞం దలఁదాల్చి నాథ! మనుదున్
నీప్రేమపాత్రంబనై
శ్రేయోదాయక మెల్లలోకముల కీ
సృష్టిన్ వెలుంగొందు నీ
జాయన్ నేనగుకంటె వేఱ కలదే
సౌభాగ్య? మీకాంత నా
హ్యాయుస్స్ఫూర్తి నెలర్చి యిచ్చెదను వి
ద్యల్ సర్వసౌభాగ్యముల్. ౮౦

గీ. సర్వసృష్టియు నీనాదుసంతతి యగు
నైన జీవులపూర్వపుణ్యంబువలన
మనకు లీలార్థమును గల్గు మమత యొకట
నీయహల్యమహాభాగ్య మెంతయొకద! ౮౧

గీ. అర్హ్యనా ? దేవ ! తలఁప నీయమృతసృష్టి
భవ్యభవదీయసత్కృపాప్రసరణమునఁ
గవివరేణ్యపవిత్రముఖస్థిత నయి
తెలచుచుందు మహాత్మ ! నీదివ్యలీల.” 22

చ. అని మధురంబుగాఁ బలికి
యాదిసరస్వతి భక్తియుక్తి పెం
పున బ్రకటింపఁగా నజుఁడు
మోము వికాసము నంద నొక్కక్రీఁ
గనునునుచూడ్కి వాణికనుఁ
గందువఁ జేర్చిన నామెచూపుతో
నినుపయి చూడ్కిజంట కన
నేర్చిన దైక్యత యొక్కవేల్మిడిన్. 23

చ. “తరుణి ! భవన్ముఖాంబుజసు
దర్శనయోగముచేత నే సుదు
స్తర మగుసృష్టివార్నిధిని
దాఁటఁగఁజాలుచునుంటి నింక నీ
యురుతరభక్తియుక్తులకు
నొప్పె మనోంబుజజృంభణంబు నే
వర మొకటైనఁ గోరుకొని
భవ్య నొనర్పుము నన్నుఁ గోమలీ! 24

క. ఇదె యీయహల్యఁ గైకొని
ముద మొదవఁగఁ జేయవలయుఁ బూవుంబోఁడీ!
మది నున్నకోర్కె యడుగుము
సుదతీ!" యని యజుఁడు వాణిఁ జొక్కించుటయున్.

ఉ. "నీరజసూతి! నీవు కరు
ణించినయాకడగంటిచూడ్కి వి
స్ఫారమదీయభాగ్యపరి
వర్ధకమై నను ధన్యఁ జేసె; నిం
పారుభవత్కృపాకలన
హాఁ బదివేలు ప్రియంబుమీఱ నేఁ
గోరెడుకోర్కికిం దెలుపఁ
గోరెద నీదగునంతరంగమున్. ౭౬

క. ముప్పురుమూర్తు లిీరల
కివ్విధమున నీర్ష్య యుండ నేకారణ? మీ
విశ్వనిత సృష్టిచేయఁగ
నవ్విష్ణునిపై ననూయయా? తెల్పఁగదే! ౭౭

గీ. చనవుబలిమిని నడిగినచాపలంబు
సైఁచి తీర్పుము నాదగుసంశయంబు
మన్మనోనాథ! యింతటిమహిమ కలుగు
మీకు నొరయిక కలుగుట మేలె? చెపుము." ౭౮

చ. అనుచును భారతీరమణి
యాచితి మీఱనిభంగిఁ బ్రాణనా
థునిహృదయం బెఱింగి తఱి
తోడుపడంగ వరంబు వేఁడుమ
న్ననమెయిఁ బృచ్ఛసేయఁగను
నల్వయుఁ దాఁ జిఱునవ్వుతోడియా
ననముల నట్టిప్రశ్నకు మ
నంబునఁ గోపము లేమిఁ జూపుచున్.

గీ. "పడఁతి! నీ విట్టిప్రశ్నంబు నడుగుదు వని
యనుకొనఁగ లేదు తెలియదా? యన్నుమిన్న!
మాకు నోరయిక కల్గునే మనములందు?
నిటులు లీలార్థమై నడపుటలు కాక. ౮౦

మ. సకలస్థావరజంగమం బగుప్రపం
చంబుం సృజింపంగ వ
ర్థకముం జేయ వినాశముం బొనరుపం
ధర్మంబులై చెల్ల మే
మకలంకాత్మలమై పరస్పరము సా
హాయ్యంబుఁ గైకొంచు నీ
సకలంబుం దరుణీ! యొనర్తుము జగ
చ్చక్రానుకూలంబుగన్. ౮౧

క. ఎఱుఁగును హరి నాహృదయము
నెఱుఁగుఁ దద్ధృదయ మీశుఁ డెల్లప్పుడు నే
నెఱుఁగుదును వారిహృదయము
లెఱిఁగియె చరియింతు మెల్లయెడలఁ దరుణీ! ౧౨

మ. ఒకయుత్కృష్టమనోరథంబు మదిలో
నొప్పార దేవీ! జగ
త్సకలాహ్లాదకరంబు గాఁగ నిపు డీ
సంకల్పినై యీపడం
తుక సృష్టించితి నంతె కాని మఱి యా
త్మస్నేహంబు ద్వేషంబు నీ
ర్ష్య కతం బేదియుఁ గాదు సాధ్వి!" యని వి
స్పష్టంబుగాఁ జెప్పుచున్. ౧౩

మ. నలుమోముల్ నగుమోములై నిగమస
న్మానంబులై విస్ఫుర
త్కలనాదాంబుధులై మనోహరములై
క్రమంబులై యొప్పఁగాఁ
జెలువం బెంతకుఁ జేర్చి శ్రోత్రయుగళిన్
జెందించె నాతం డహ
ల్య లతాంగీమణియై యొనర్చె భవిత
వ్యాపాదకోదంతముల్. ౧౪

చ. సలువ రహాస్యభంగిఁ దన
నాతికి నాతియహాల్యసంగతిన్
దెలిపెడు వేళఁ బద్మజుని
దివ్యముఖంబులు వాణిచెక్కులన్
లలితగతిన్ స్పృశింపఁగ న
లభ్యముఖామలచుంబనక్రియా
కలనకు సాత్త్వికోదయముఁ
గాంచె సరస్వతి పేర్మి పెంపునన్. ౮౫

చ. పడఁతి యహల్య యీపరమ
పావనభంగిమఁ గాంచకుండఁ జొ
క్కుడరఁగఁ జేసె నామెకు న
జాంగన స్వీయమహత్త్వహేతు వే
ర్పడఁగ; విధాతకున్ గలిగె
భామకపోలము లంటువేళఁ జొ
ప్పడఁగఁ బవిత్రసాత్త్వికశు
భప్రదరాగమహానుభూతియున్. ౮౬

క. ఇది యిటు లోకశృంగారా
భ్యుదితక్రియ యాచు నొప్పె నుత్తమవాణీ
సుదతీచతురాననస
మ్మదహేతువు నతిపవిత్రమున్ శుభదంబున్. ౮౭

మ. "సతి! నీ వింక నహల్యకున్ గృపఁ గళా
సర్వస్వముం దెల్పి యు
న్నతభావంబులఁ దీర్చి దిద్దుము పయిన్
బ్రహ్మర్షి వర్యుండుఁ బూ
జ్యతముండున్ గడు నైష్ఠికుం డొకఁ డహ
ల్యాకాంతకున్ భర్తయై
నతిలోకప్రతిభాప్రభావముల న
త్యంతంబుఁ గై సేయఁగన్." ౮౮

చ. అని చతురాననుండు తన
యాలికి నాయమ నొప్పగించి తా
ననుపమ నైజ కార్యముల
యందు నెసంగెను; వాణియున్ గడం
గెను బ్రియమార నేర్పఁగ న
మేయకళాకమనీయబోధనా
ద్యనితరసాధ్యభంగిమ న
నంతము లైనకళారహస్యముల్. ౮౯

క. చదువులరాణియె ప్రియ మిం
పొదవఁగ మృదుమధురరీతి నురుతరవిద్యల్
మొదలంటఁ జెప్ప నింకొక
చదువులరాణిగ నహల్య చయ్యన నలరెన్. ౯౦

చ. పురపురఁ బొక్కిపోయె సుర
                    ఘ్యంగవులందున యక్షజాతిలో
నరవరులందుఁ గిన్నరుల
                    నాగకులంబున సిద్ధులందునన్
గరుడగణంబులందుఁ బదు
                    నాలుగులోకములన్ విరించి సుం
దరిని సృజించెఁ దా నిరుప
                    మానముగా ననువార్త వ్రేల్మిడిన్. ౯౧

మ. తలదన్నున్ భువనంబునందలి సమ
                    స్తంబైననారీజనం
బుల సౌందర్యమునన్ మనోజ్ఞతను సొం
                    పుం బెంపు నింపున్ లతాం
గుల కెల్లన్, గనఁబడ్డమాత్రమున స
                    మ్మోహంబుఁ బుట్టించు యో
గులకున్ ; జిత్రము చిత్ర మంచు జనముల్
                    గోసెక్కఁగాఁ జేయఁగన్. ౯౨

క. సురవరులు మాసిరాజులు
నరుదేరఁ గడంగి రజునియాస్థానికిఁ జి
త్తరువులై యగుచుండిరి త
త్తరుణిం గని తత్తరంబు తలకొనుమదులన్. ౯౩

సీ. పని యున్న లేకున్న వనిత కన్పడు నన్న
మతి వచ్చుచుండు నమరగణంబు
అజసృష్టి పెంపుసొం పఖిలంబు నొకయెత్తు
నిది యొకయెత్తని ఋషిగణంబు
ఎటు లున్నదో చూచి యేఁగుద మంతియే
యనుబుద్ధివిష్ణుశివానుగణము
మోహినియో కాంచి మోహించునంట యీ
మోహనాంగి నటంచు మునిగణంబు

సీ. పేరు వా రన నేల యావిశ్వకర్తఁ
జేర ననుమతి కలసర్వజీవగణము
జెప్ప మా పనకుండఁ దండోపతండ
ములుగ వచ్చుచుఁ జూతురు లలి నహల్య.

చ. చిలుకలకొల్కియో మరుని
చేతికటారియొ సానదీయఁగా
వెలసినరత్నమో మెఱుఁగు
వెట్టినబంగరుతీఁగయో వలం
తులకు వలంతి యైనబలు
ముత్తియమో విరికల్వదండయో
తెలుపఁగఁ జాల మంచుఁ బలు
తెన్నులఁ బల్కుదు రామె నందఱున్.

గీ. లోప మెంచంగ నెవ్వరి కోప దనుచుఁ
గన్న విన్న జనంబు లాయన్ను మిన్న
నెన్ను చుందురు మఱిమఱి సన్నుతించి
యంగనకు నిచ్చదిస్టితీయంగ వాణి. ౯౬

ఉ. అందము చందముల్ నయభ
యంబులు గల్గి సరస్వతీసతీ
మందిరశోభయై లసద
మందమరందవచోసుధాన ష్ప
ష్పంథయ వేణి యై పలుకు
బంగరువై నడ నంచయానయై
నందియ మేల సర్వగుణ
సంపద నింపు నహల్య సొంపునై. ౯౭

క. సంగీతము సాహిత్యము
నంగనకుఁ దలఁపఁ గరతలామలకములౌ
భృంగిటుని సర్వనటనా
భంగిమకున్ గాణయాచి పడఁతి తలంపన్. ౯౮

క. అఱువదినాలుగుకళలన్
గఱదతనంబును గణించెఁ గాంతయుఁ బిదపన్
గఱపఁ గలవెల్లఁ గఱపినఁ
గఱవాయెన్ వాణి కింకఁ గఱపెడువిద్యల్. ౯౯

క. ఉత్తమపాతివ్రత్యము
నుత్తమసౌభాగ్యసంపదుద్వృత్తత య
త్యుత్తమగుణములు పుట్టిన
యుత్తరనిమిషంబునందె యువిద వరించెన్. ౧౦౦

చ. నవనవలాడుయౌవనము
నందనరారునహల్యఁ జూచి యిం
పవుపువువిల్తుముల్కులక
హా! గుఱికానిజనంబు శూన్యమే
యవుట గ్రహించి ధాత తఱి
యారయఁ జొచ్చె నహల్యకుఁ వివా
హావరమహోత్సవంబునకు;
నక్కట! తప్పెనె బ్రహ్మకుఁ వగల్.౧౦౧

ఉ. అంతటిలోన సిగ్గు విడ
నాడి మహేంద్రుఁడుఁ దక్కినట్టిదె
త్త్యాంతకు లెందఱో తమకు
నంగన నిమ్మని వేఁడుకొంటి కా
దెంతయు దైన్యభావమున
నిచ్చునొ యీయఁడొ యన్నబుద్ధి న
త్యంతము నాశ్రయింపఁ జతు
రాననుఁ డందఱుఁ ద్రోసిపుచ్చుచున్.౧౦౨

క. తొందరపడకుఁడు త్వరలో
సుందరివై వాహావిధులు చూడఁగ వచ్చున్
డెందంబుల నావంతయు
సందియముల్ గనక పొందు సమయమువచ్చున్". ౧౦౩

మ. అనుచున్ బల్కుచుఁ బంపి వేయ సురల
త్యంతఁబు డెందంబులన్
గనుచున్ గుందును బోవుచుండ రిఁకఁ బ
ల్కంజాల కాబ్రహ్మదాఁ
పునః మానీంద్రులు కొంద ఆమె సతిగాఁ
బొందంగ నత్యుగ్రని
ష్ఠను ధాతన్ గుఱియించి ఘోరతపముల్
సల్పంగ నున్నంతలో. ౧౦౪

మ. అజ దేవుండు సరస్వతీరమణి నా
ప్యాయంబుగాఁ బిల్వఁబం
చి జగత్కారణభూతుఁ డయ్యుఁ ద్రిజగ
త్సేవ్యుండునయ్యున్ సమ
స్తజనప్రస్ఫుటభూతభావిగతులన్
శాసించువాఁ డయ్యు న
క్కజ మాందోళన మంది పల్కె గళముల్
గాద్గద్యమగ్నంబు గన్. ౧౦౫

ఉ. "దేవి ! మహేంద్రుఁ డాది యగు
దివ్యు లహల్య వరించి వచ్చి త
ద్భావనచే మనంబు లతి
వా! వివశంబులు గాఁగ దీనులై
యేవిషయంబుఁ బల్కుదురొ
యెవ్వనిముందు వచించుచుండిరో
భావన లేక వెఱ్ఱు లయి
పల్వదుచుండిరి మన్మథాగ్నికిన్. ౧౦౬

శా. పూవుంబోఁడి ! యహల్యనుం బడయుచు
న్మోహంబుతో నెందఱో
యావిష్ణుల్ శివు నన్నుఁ గూర్చి వ్రతచ
ర్యల్ సత్తపోనిష్ఠలన్
గావింపంగఁదొడంగి రింక మఖముల్
గావించుయజ్వల్ మహా
భావంబుల్ బహుమంత్రతంత్రములు నే
ర్వంజొచ్చువా రెందఱో ! ౧౦౭

చ. తెలిపియె యుంటిఁగా దె సుద
తీ! యిది యేనికి భార్య యౌనొ నా
కలవియె దాని మాన్ప నిఁక
నన్యవిధంబున నెట్లొనర్తు ? నీ

పలువురు నేడ్వఁ గుండెమను
పాయమునన్ దరుణీ! యహల్య పెం
డిలి యొనరింపఁగా వలయు
మానవిలోచన! చెప్పు మెట్టులో? ౧౦౮

మ. అనినన్ "దేవ! సముంచితం బగునుపా
యం బెన్నఁడో యామెఁ జే
సిననాఁడే లిఖియించి యుండి కరుణా
(శ్రీ)పెంపునం గాదె! పె
ద్దను సన్ జేసి మనోహరా! యడుగుటల్
ధన్యాత్మ నే నిట్టినీ
యనుకంపన్ బడయంగ నోచుటను న
త్యాశ్చర్యముల్ త్వత్కృతుల్. ౧౦౯

మ. త్రిజగత్సృష్టివిభూతి నీది పరికీ
ర్తింపంగ నేఁ బూనుటల్
నిజ మెంచన్ గడు దప్పిగొన్నతఁడు ము
న్నీ రెల్లఁ గ్రోలంగ న
ర్కజ మహానల్లు కడంగుటే యగు జగ
త్కర్తృప్రభావాఢ్య! స
న్నిజకారుణ్యముచేత నైఁపఁగదె వా
జ్నిర్మాణచాపల్యముల్. ౧౧౦

క. పదునాలుగుభువనంబుల
నుదయింపఁగఁ జేయుచుండు వ్యూహాతీతా
భ్యుదయ మగుజీవసంతతి
విదితంబుగ నందు నీప్రవీణత యెల్లన్. ౧౧౧

చ. ఒకనరుఁ బోలునట్టినరుఁ
డొక్కఁడు కానఁగ రాకయుండు నీ
సకలవిశాలసృష్టిని వి
చక్షణ చేయఁగ సర్వజీవకో
టికిఁ దగినట్లు సర్వము ఘ
టింతువు భోజనభాజనంబు లాం
గికములు వేళదప్పక వి
కీర్ణము కానిరహస్యభంగులన్. ౧౧౨

చ. ప్రకృతి సమస్తముం గనఁగ
భవ్యభవన్నిపుణత్వ మెల్లెడన్
బ్రకటిత మౌచునుండుఁ బరి
పాటిమెయిన్ బ్రియ! యీసమస్తవృ
క్షకములు వేళ దప్పక ప్ర
శస్తత పీడక పూయఁ గాయఁ బా
యక చిగురింపఁ జేయుభవ
దద్భుతశక్తిఁ దలంపఁ జోద్యమౌ. ౧౧౩

క. నానావిధవర్ణంబుల
నానావిధవర్ణసమితి నానావిధస
మ్మానితఫలపుష్పంబుల
నానాత్వము చూపుచుందు నాథ! యొకండవున్. ౧౧౪

చ. తెలతెల తెల్లవాఱఁ గడుఁ
దీర్చియు దిద్దియు సొంపు నింపు శి
ల్పులు శతకోటికోటు లగు
మొత్తముసైతము నొక్కపూవులే
దళమున నొక్కరంగయినఁ
దార్పఁగఁజాలరు దేవ! నీవ యే
పొలుపున సర్వవర్ణములుఁ
బువ్వుల కిన్నిటి కెట్లు వైతువో! ౧౧౫

క. కడుసౌందర్యశ్రీలన్
గడలొత్తిన యీయుహాల్యకంబున్ దేవా!
జడమైన లేఁతతృణమునఁ
బొడగాంతును గోటిరెట్ల పొలుపున్ వలపున్. ౧౧౬

మ. సికతాలేశమునుండి నీవజుకునుం
జెల్వొందునీసృష్టిలోఁ
బ్రకటంబౌ భవదీయసుందరకళా
వైదగ్ధ్య మిందెల్లవా

నికిఁ గాలంబును గర్మముఁ సకలముఁ
నిర్మించి నీ వంత దే
నికి నేవేళను నెద్ది కల్గవలెనో
నిత్యంబు సంధింప వే! ౧౧౭

మ. మును నీ వీమెకు నేర్పరించినక్రియఁ
ముమ్మాటికిం బెండ్లియా
మన కెల్లఁ విదితంబె కావున జగ
న్మాన్యంబుగా సర్వ దే
వనికాయంబును మానిసంతతిని బి
ల్వం బంచి వేగంబ ర
మ్మనుమీ యామెస్వయంవరంబునకు బ్ర
హ్మర్షీంద్రబృందంబులన్. ౧౧౮

క. దయతోడ నీవు పలికిన
క్రియ నీమెవివాహ మగును క్రీడార్థము భూ
వియదంతరజీవులకున్
నయనోత్సవ మగును మనకు నా వేఁడుకయున్." ౧౧౯

క. అని పల్కు వాణిపల్కుల
కును బ్రీతి వహించి ముదము కొమరారఁగ నా
వనజజుఁడు సకలలోకము
లను జాటఁగఁ బంచెఁ బ్రవిమలం బగువార్తన్. ౧౨౦

మ. "అరయంగా వరణంబుఁ గాంచఁగ నహా
  ల్యాకాంతచేతన్ స్వయం
వరదివ్యోత్సవ మెల్ల బ్రహ్మసభలో
  మాన్యంబుగా నౌను వే
గిరమే రండు మునీంద్రులున్ సురలు నం
  గీకారమై దానికిన్
వరగంధర్వులు యక్షకిన్నరులు రా
  వచ్చున్ యథేచ్ఛంబుగన్. ౧౨౧

క. మీమీపుణ్యము పండిన
భామామణి వలచు నొకని భర్తగ రండీ
యామార్గము కాకున్నను
బ్రేమం జనుదెండు వనితపెండిలి చూడన్." ౧౨౨

మ. అనుమాటల్ విని యెల్లవారలు నగ
  ణ్యానందులై తమ్మె యా
వనితారత్నము వల్చునన్న యనుభా
  వం బేర్పడన్ సర్వదే
వనికాయంబులు మౌనిచంద్రులు యశో
  వరిష్ఠులై బ్రహ్మదే
వునియాహ్వానము స్వీకరించి పయనం
  బుల్ సల్పి రుత్సాహులై. ౧౨౩

చ. అజుఁడు సరస్వతీసహితుఁ
డై తనవాహనముం దలంచి య
క్కజముగ దానిపైఁ బ్రియము
గాఁ జని గౌతమమౌనిరాణ్ముఖాం
బుజమును గాంచి వాహనము
ముంగిట డిగ్గి సతీసమేతుఁడై
సజల వలాహకధ్వనిఁ బ్ర
శంస నొనర్చె మునీంద్రచంద్రునిన్.౧౨౮

గీ. కరములు మొగిడ్చి యతిభక్తి గౌతముండు
నజుని వాణిని స్తుతియించి యధికముదము
నంది యర్ఘ్యపాద్యమ్ముల నాదరించి
"యిటులు కరుణింపఁ గారణం బేమి ?" యనిన. ౧౨౯

ఉ. "గౌతమమౌనిచంద్రమ ! య
కారణవత్సలతన్ గణించి వి
ఖ్యాతము నీమహాశ్రమముఁ
గాంచి సరస్వతి నేను గాఢసం
ప్రీతుల మైతి ; మందినదె
రేపటియుత్సవవార్త ? నీవు సం
ప్రీతి వహించెదే ? కరుణ
పేర్మి నెఱుంగవె సర్వవృత్తముల్ ?౧౩౦

గీ. నైష్ఠికబ్రహ్మచర్యంబునం దపంబు
సలుపునీ దగుపుణ్యదర్శనమువలన
మాకు ధన్యత్వ మబ్బె నీమాన్యపదము
లరిది కొనియాడ నెవ్వాని కైన వాని! ౧౨౭

క. పనివిని యెద మిఁక నీవును
బనివినఁగా వలయు తేఁపు భవ్యంబుగ నీ
యనితరసౌభాగ్యంబును
గనఁగంటకు మాకుఁ గనులు కాయలు కాచెన్." ౧౨౮

గీ. అనిన గౌతముఁ డజునితో ననియె "దేవ!
సర్వ మెఱుఁగుదు నీ కేల సంశయంబు?
వచ్చుట నిజంబు మఱియును దెచ్చుకొంట
కూడ నిజ మగు నాకును గుతుక మదియు. ౧౨౯

క. మనుజులలలాటలేఖలు
వనజజ! చెఱుపంగ వశమె? వచ్చెద సెల వి"
మ్మని వేఁడుకొనిన నజుఁడును
వనజాననఁ గూడి పట్టె వచ్చినదారిన్. ౧౩౦

మ. "తరుణీ! యీతఁడు బ్రహ్మనిష్ఠుఁడు తనం
తం దాను భావించుచోఁ
బరమక్రీడ మదాజ్ఞ మీఱి నిలువన్
బ్రవ్యక్తశక్తుండు నేఁ

గర మీాశ క్తి యెఱింగి నిత్యము జా
గ్రత్తఁ మహర్షీంద్రులఁ
బరిపాటిం గని వత్తు నాపనులుగా
భావింతుఁ దత్సేవలున్. ౧3౧

క. అఖిలము నెఱిఁగినపిఙ్జులు
సఖి! వారలు కాన నాదుశాసనజాతం
బఖిలంబును బాలింతురు
సఖి! నఁ శాసింపఁ జాలుశక్తుల రయ్యున్. ౧3౨

ఉ. ఇందుల కీమహాత్మ్ముని మ
దీప్సితసిద్ధికి ముందుఁ గంటి నిం
దిందిర వేణి! న న్ననిన
మీాఁదట సర్వ మెఱింగి యాతఁ డా
నందముతోడ నియ్యకొ నె
నాదగుశాసనముఁ భజింప" సం
చుం దయఁ దెల్పె బ్రహ్మ తన
సుందరి; కంతట వచ్చె గేహమున్. ౧33

క. అని సూతుఁడు వినిపించిన
విని మీాఁదటికథ నెఱుంగ వీనులవిందౌ
నని మానులు కడు శ్రద్ధఁ
విన నువ్విళు లూరుచుండ్రి విశ్వాధ్యక్షా! ౧3౪

మ. గురుదేవా! పరిపూర్ణవత్సల! జగ
ద్గుప్తాద్భుతజ్ఞాన! వి
స్ఫురదత్యంతవివేకభూషణ! మహా
పుణ్యాత్మసామ్రాజ్యరూ
పరమానాథ! యనాథనాథ! పరమ
బ్రహ్మర్షి చూడామణీ!
పరమాత్మా! భవసింధుపోతమ! జగ
ద్భద్రానుసంధాయకా! ౧౩౫

క. భక్తజనరక్తి వస్తువి
రక్తియు శరణార్థిజనులరక్షణశక్తుల్
యుక్తియుఁ గలిగిన యుత్తమ
శక్తీ! గురుదేవదేవ! సర్వజ్ఞ! ప్రభూ! ౧౩౬

క. నిరుపమవిధనిగమజ్ఞా!
పరిపూర్ణకృపాకటాక్ష! భక్తాధీనా!
సురుచిరసురూపసుందర!
పరమాత్మా! దేవదేవ! పావనతేజా! ౧౩౭

గద్యము. ఇది శ్రీగురుకటాక్షలబ్ధకవిత్వ గౌతమసగోత్రపవిత్ర
బులుసు వేంకటేశ్వరప్రణీతం బైన శ్రీమదహల్యా
గౌతమమునఁ బ్రథమాశ్వాసము.

శ్రీగురుభ్యోనమః

# అహల్యాగౌతమము

—:o:—

## ద్వితీయాశ్వాసము

శ్రీధవదుర్గాధవవా
ణీధవరూపాదిరూప! నిరుపమరూప
శ్రీధర! శ్రీధర! కరుణా
శ్రీధర! బ్రహ్మర్షి చంద్ర! శ్రీగురుదేవా! ౧

వ. తదనంతరకథావిధానం బెట్టి దనిన: ౨

చ. అనుపమవాగ్విలాసము
దంచితమాధురి మేదురంబుగా
మునివృషభుండు సూతుఁడు ప్ర
మోదితచిత్తుఁడు సద్గురూత్తముఁ
మనమున భక్తిసంభరిత
మంజులరీతిఁ బునఃపునఃప్రశం
సను దలపోసి పోసి యరు
సంబునఁ బల్కెను మీఁదిసత్కథన్. 3

మ. పరమర్షీంద్రులు యోగిచంద్రములు జం
భారాద్యాది దేవప్రభుల్
చిరకాలంబు తపించి కూడఁ గనఁగాఁ
జింతింపఁ జేరంగ నే
రరు నిత్యంబును నిర్వికల్ప మగుచుక్
రంజిల్లు నే దట్టిపం
కరుహోద్భూతజగంబునుం దలఁప శ
క్యంబే లవంబేనియున్. ౮

గీ. మూఁడుమూర్తుల వెలసినముబ్బురందు
మొదటిమూర్తిని దాలిచి మొనసి జగము
లవిరతంబుగ సృష్టించునతనిదైన
పుణ్యలోకము స్మరియింపఁ బొలియు నఘము. ౯

మ. శతసాహస్రయుగంబు లొక్కటి మహా
శ్చర్యంబుగా శిష్టస
మ్మత మానుగ్రతపంబు సల్పినజగ
న్మాన్యుల్ మహాభక్తిన
ర్థితవిజ్ఞానవికాసశోభితులుఁ బా
తివ్రత్యధర్మంబు సం
స్తుతిపాత్రంబుగఁ గన్న సాధ్వులును న
చ్చో నుందు రానందులై. ౬

చ. జననజరావివర్జితులు
సత్త్వగుణోన్నతమూర్తిమంతులుఁ
వినుతయశోమయాత్ము లతి
విశ్రుతతేజులు జ్ఞానమూర్తులుఁ
సనకసనందనాదిముని
సన్నుతిపాత్రులు యోగిచంద్రులుఁ
గొనకొని పొల్చుచుందురు మ
నోజవయోగజవంబు పెంపునన్. ౭

మ. పరమప్రాప్యము నైనబ్రహ్మపదసం
భావాత్ములై ముక్తులై
నిరతంబుఁ వెలుఁగొందుచుందురు జగ
న్నిర్మాణచాతుర్యభా
స్వరయోగంబున నిష్క్రియాత్ములు నపే
తానిర్వృతుల్ నిత్యదీ
ప్తిరమాభూషణు లాత్మవిజ్ఞులు మహా
దేవాంశు లత్యుత్తముల్. ౮

చ. అవిరళపఠ్యమానచతు
రాగమసూక్తులె యెల్లవారికిఁ
బ్రవిమలమానసాంబురుహ
పంక్తికి జృంభణమున్ మహోజవం

జపపరిపాటికిఁ బిలయు
సంగతియుం బొనరించుచుండఁ బెం
పపును విరించికిఁ బిరత
మాగమనాదము కర్ణపేయమై. ౯

మ. చతురామ్నాయపవిత్రతాస్ఫురణమున్
శక్త్యున్నతుల్ సర్వదే
వతలన్ శ్రేష్ఠత నిర్వికారతయు ని
ర్వ్యాపారధర్మంబు సం
చితయోగంబును నందు నెల్లరకు సం
సిద్ధంబె యై యుంటచే
నితఁడున్ బ్రహ్మయె యీతఁడున్ నలువ యం
చెన్నంగ నౌ నెల్లరిన్. ౧౦

గీ. అట్టిలోకంబునందు నహల్య కొనరు
నట్టి దైనస్వయంవర మనుకతమున
సకలలోకంబులందలి సుకృతజనులు
బ్రహ్మలోకంబుఁ జేర నర్హత గడించి. ౧౧

మ. వ్రతదానక్రతుయోగమూలమున ల
భ్యం బైనపుణ్యంబు సం
తతదీక్షావిధినిర్వహాదికతపో
ధ్యానాత్తపుణ్యంబు దే

వతలన్ మాత్రము కూర్చు నంతియె యల
భ్యం బైనయీయోగమున్
వితపోసీక గమింత మంచు మును లా
విర్భూతమోదంబునన్. ౧౨

క. పూవులవంకను దారము
భావితమై తలకు నెక్కుపగిదిని నెవరున్
భావించి చేరఁ జాలని
యావిశ్వసృజు సభఁ జేరి రఖిలజనంబుల్. ౧౩

గీ. బ్రహ్మకృపచేత నెల్లరు బ్రహ్మలోక
మునకు నటు లేఁగి యవిరళామోదజలధి
మగ్నులై స్వీయనేత్రసంపదలఁ దలఁచి
తామె తమనేత్రముల్ నమ్మఁదరము కాక. ౧౪

క. కరువులభంగిని మఱి చి
త్తరువులభంగిని దలంపఁ దరువులభంగిన్
గురులోహ స్తంభంబుల
పరుసున నిశ్చేష్టు లగుచుఁ బరగిరి జనముల్. ౧౫

మ. తలపోఁతన్ గల గన్న రాజ్యరమ స
త్యంబై కరం బూనిన
ట్టు లనాయాసమునన్ సుధాఝురి నిరా
టోపంబుగా నోటిలో

పలఁ బడ్డట్లు తృణంబుఁ గోరఁగ మహా
భాగ్యంబుచే మేరువే
వలపుం బూని కరస్థమైనటులు సం
ప్రాప్తించెఁగా యోగముల్. ౧౬

ఉ. అజ్ఞులు కొంద ఱప్పు డప
హాసము లాడఁ దొడంగి రొండొరుల్
ప్రాజ్ఞు లహల్యసంగతియుఁ
బద్మభవామలదివ్యనవ్య స
ర్వజ్ఞతయుఞ్ గ్రహించి సుఖ
పారముఁ గాంచి వెలింగి రెల్లమ
ర్మజ్ఞులు దైవలీలలకుఁ
బ్రమంది తలంచి రహల్యసంగతిన్. ౧౭

మ. అనుభావంబున దేవబృందములు నూ
హాతీతసంతుష్టమై
మనుజర్షీంద్రగణంబులుఞ్ బహుజగ
న్మాన్యాత్మమై యేఁగుదే
ర నపూర్వం బగునేత్రపర్వ మగుచుఞ్
రాజిల్లునేతన్మహా
వినుతంబై సస్వయంవరోత్సవసభా
విఖ్యాతి యత్యంతమా. ౧౮

సీ. తనభోగ మంతయుఁ గనిపించునట్లు వై
భవము మీఱఁగ వచ్చె దివిజభర్త
తననిధీశ్వరతకు మనసు లూరఁగఁ జేయు
చెలువంబుతో వచ్చె నలకభర్త
తమసుందరత తమయమలహాసంబులఁ
బొగడొంద వచ్చిరి దిగధిపతులు
తమవిలాసములకు సమత లే దన నొప్పు
కాంతిని వచ్చిరి కంతునిభులె

గీ. యైనసుందరు లెల్ల రత్యాదరమున
నేల యీనినయట్టులు నింగి తార
కాసమున్నీల మైనట్లు కానఁబడఁగ
నిసుము చల్లిన రాలన నెసక మెసఁగ. ౧౯

క. చతురాననసభయందున
నతిముద మొదవంగ వార లంద ఱహల్యా
వితతాకృతిపరినిష్ఠిత
మతులై చెలువంద సభయు మాన్యం బయ్యెన్. ౨౦

మ. బహుళోదారతపోధనాఢ్యులు జగ
ద్బంధుల్ కృపామూర్తులై
సహనంబున్ శమముం దమంబు మఱియున్
శాంతంబు నిండన్ మహా

మహులై పంక్తులుదీరి వచ్చియు సభా
మధ్యంబునందుఁ లస
త్ప్రహసానూనముఖాంబుజంబులను సం
భావార్హులై రంతటన్. ౨౧

మ. తన తేజం బది పూర్ణచంద్రరుచిసం
తానంబు నోడింపఁగాఁ
దన నేత్రద్వయి జ్ఞానగోళయుగళిన్
దర్పంబుతోఁ బోలఁగాఁ
దనయూజానుకరాంబుజంబులును సౌం
దర్యంబు రెట్టింపఁగా
మునిచూడామణి గౌతముండు సభకున్
మోదంబుతో వచ్చినన్. ౨౨

గీ. అఖిలజనముల నేత్రంబు లతనివైపు
మరలి యతిలోకసౌందర్యమధువుఁ గ్రోలె
నాత్మవిశ్వాస మంతయు నంతరింపఁ
బొగడి రెల్లరు నాతనిపుణ్యమూర్తి. ౨౩

సీ. చ్యవనుండు జమదగ్ని జాబాలి రైభ్యుండు
పులహుండు వచ్చిరి భూరిమహిమఁ
గ్రతుకశ్యపులు నత్రి రైవతుండు దధీచి
కుంభజుల్ వచ్చిరి కొమరుమీఱ

రోమశుండును మహారోమపాదుఁడు భర
ద్వాజుండు వచ్చిరి తేజ మెసఁగ
శౌనకశాండిల్యశాకటాయనశుకుల్
వచ్చిరి మహిమంబు లచ్చుపడఁగ

గీ. బాదరాయణముఖ్యు లాప్రథితఋషులు
మఱియు దుర్వాససాదికమహితయశులు
నారదాదికదేవర్షినాథు లెల్ల
రొక్కరును దక్కకే వచ్చి రౌనర ఋషులు. ౨౮

గీ. వారహల్యను వరియింపఁ గోరి కాదు
వచ్చుటల్ బ్రహ్మకోరిక పాటిసేయు
తలఁపునం గాని వారికిఁ వలపు గలదె ?
ముక్తిసుందరిపై ననురక్తి దక్క. ౨౯

చ. ఎవరికి వారె పెద్ద లయి
యింపుగ సొంపుగ భక్తియుక్తులై
సవినయసౌకుమార్యముల
సందడిలేక యథోచితంబుగా
వివిధసుఖాసనంబులఁ బ
విత్రత వార లలంకరింపఁగా
సవితలఁ బోలి పొల్పెసఁగఁ
జాలిరి చూడఁగ నొక్కరొక్కరున్. ౨౬

మ. తనయాలిన్ దనయాలిఁ గూడుకొని వా
త్సల్యంబు తోరంబుగా
ననుమోదంబునఁ బార్వతీధవుఁడు తా
నానందియై నందిపైఁ
జనుదెంచెన్ ద్రిజగజ్జనంబు జయని
స్వానంబులం జేయఁగా
నినుపారంగ దిదృక్షులోకమునకున్
బెల్లైనకోర్కుల్ తమిన్. ౨౭

శా. శ్రీదేవీసహితుండు విష్ణువు జగ
త్క్షేమంకరుం డౌచు నా
హ్లాదామోదము లొప్పఁ దార్క్ష్యుపయి లీ
లార్థంబు విచ్చేసె స
మ్మోదాంభోనిధిఁ దేలి యెల్లరు జగ
న్మోదాకృతుల్ గాంచి "యో
శ్రీదేవీధవ! పాహి! పాహి!" యని వా
క్పూజ గావింపఁగన్. ౨౮

క. కమలజుఁడు క్రమభంగిని
గమలాకాంతుని భుజంగకంకణునిఁ బేర్మిన్
సమయోచితమర్యాదా
సమవేతులఁ జేసి ప్రియము సలిపెన్ బ్రజకున్. ౨౯

క. వాణీదేవియు విష్ణుని
రాణిని మఱి భర్గురాణి రమ్యాలాప
శ్రేణిఁ బందిరివెట్టెడు
పోణిమి మర్యాదచేయ ముదమున వారున్. 30

క. "ఏదీ మీప్రియపుత్త్రిక !
యేది వధూమణి యహల్య! యెట నున్న" దటం
చాదరమయ మేదురస
మ్మోదంబునఁ జూచి ముగుద మూర్కొనిరి కృపన్. 31

క. మిఱుమిట్లుగొలుపుసుందరి
మెఱుగుందీవియను బోని మే నరసి జగా
మెఱుఁ గరసి సర్వ మారసి
మఱిమఱి మెచ్చంగఁ గనిరి మాపార్వతులున్. 32

గీ. బ్రహ్మవిష్ణుమహేశదర్శనము వెంట
వాణి మా గౌరి దర్శనభాగ్య మొకట
సంభవింపఁగ దేవాళి సంయమితతి
నిరుపమానందవార్నిధి నెగడఁగనిరి. 33

ఉ. "ఏతొలిబాములందు గడి
యించిన యంతములేని పుణ్యమో
యీతరుణంబునందు నిటు
లీపువుఁబోఁడిస్వయంవరోత్సవా

హూతులవై త్రిమూర్తులను
నొప్పుగఁ గాంచితి మింక మాతపో
జాతము పండె ధన్యులము
చాలును బెండిలి మాకు నేలొకో ?" ౩౪

చ. అనియెడివారు "నల్వసభ
యందు జనంబులు వేచియుండ నిం
కను గట ! కాలయాపనకుఁ
గారణ మేమది ? మీన మేషముల్
కనుఁగొనఁ జాలదో ?" యనుచుఁ
గాంచెడివారు "ననుక్ వరింప కె
వ్వని వరియించుఁ గాంత ?" యను
వారును నైరి ప్రజల్ క్రమంబునన్. ౩౫

ఉ. అంత నహల్య నంచితశు
భాంగిని జక్కనిచుక్క నద్భుతా
త్యంతమనోహరాభరణ
నద్వయసుందరి నద్వితీయన
త్కాంతిమహాప్రపూరమునఁ
దన్మయ మందఁగఁ జేయఁజాలుపూ
బంతివలంతి నింతిఁ దన
బంతిని నిల్పి ముదంబు పెంపునన్. ౩౬

మ. చతురామ్నాయమహాప్రభావుఁడు
లసత్సంకల్పకల్పాత్మఁడుర్
జతురంభోజమహోపమానలసదా
స్యశ్రీలఁ జెన్నొందుసం
స్తుతసర్వామరహానిచంద్రముఁడు తే
జోనిత్యుఁడాబ్రహ్మ యం
చితమాధుర్యముఁ జిల్కఁ బల్కె సభకుర్
జేమోద్భు సంధించుచున్. 3౭

ఉ. ఓనరదేవతాదికమ
హోదయులార! మహానుభావులా
రా! నను మాన్యుఁ జేయఁగ న
నంతపథశ్రమ కోర్చి నాదునా
హ్వానము గారవించిరి కృ
తార్థు నొనర్చిరి నన్ను మీకు నీ
శానకుబేరదిక్ప్రముఖ
సర్వజనాళికి స్వాగతం బిదే. 3౮

మ. ఇదిగో! యీమె యహల్య కాంచఁగని రే
యెందైన నేరైన నీ
సుదతీరత్నముఁ బోలుసుందరిని నీ
క్షోణీతలంబందు నే

మదిరాక్షీమణి సాటి యీమెకుఁ దలం
పఁగ మూఁడులోకంబులన్
హృదయాహ్లాదము గాదె యీచిగురుఁబో
ణిం గన్న భాగ్యంబునన్. ౩౯

శా. నాసంకల్పముచేత జన్మమును గాం
చంగంట నాబిడ్డయై
తా సంగీతము సాహితిన్ మఱి కళా
తండంబు వాణీకృపా
ప్రాసంగంబునఁ గాంచె యోగ్యగుణ
వర్గంబున్ సమస్తంబు నా
వాసం బుండును నీమెయొద్ద వినుతిం
పఁగ శక్యమే యీబిడన్. ౪౦

ఉ. ఈవనితాకరాంబుజము
నెవ్వఁడు పట్టఁగలాఁడొ యాతఁడే
యీవివిధప్రపంచముల
నింతయు నంతనరానిదివ్యశో
భావిభవంబులన్ వెలయు
భవ్యమహోన్నతలోకజాలసౌ
ఖ్యావహజీవనంబున న
హా! గడియించును శాశ్వతత్వమున్.౪౧

ఉ. ఎవ్వని నీయహల్య వరి
యించునొ యాతఁడు దివ్యదేహియై
యెవ్విధమైనలోపమును
నించుక కాంచక బ్రహ్మమానియై
యివ్వల నవ్వలన్ బడయు
నీప్సితసిద్ధి గడించు నిచ్చపున్
జవ్వన మాయువున్ సిరియు
నాదునమోఘవరప్రసాదతన్." ౪౨

మ. అనినన్ శంభుఁడు పల్కె "నీతరుణిహ
స్తాబ్జంబుఁ గీలింపఁజా
లినపుణ్యాత్ముఁడు మూఁడులోకముల నో
లిం గీర్తి నిండించి కాం
చు నమర్త్యత్వము నాత్మవేదితయు వా
చోమాధురిన్ జ్ఞానదీ
క్ష నగణ్యం బగుయోగసిద్ధియును నా
కారుణ్యసంపత్తిచే." ౪౩

శా. అంతన్ విష్ణువు లేచి పల్కెను "నగ
ణ్యంబైనపుణ్యంబుచేఁ
గాంతాలోలకటాక్షబాణముల నా
క్రాంతుండు గాఁ జాలునా

కాంతుం డందునుగాక ! మద్వరము చేఁ
గల్పాంతకాలక్రమా
క్రాంతం బౌబహుధర్మమర్మములు వి
జ్ఞానార్థసంప్రాప్తియున్. ౭౭

క. "ఈముద్దుగుమ్మకుఁ బతి
యౌమాన్యుఁడు మత్కటాక్ష మందు నతం డే
భూమిని విత్తిన సస్యము
యామమునం బండు నచట" ననె నింద్రుండున్. ౭౮

క. తలపోసినంతవర్షము
తలమునుకలు గాఁగఁ గురియఁ దా వరమిచ్చెన్
లలితాంగిఁ బెండ్లియాడఁగఁ
గలయాతనికిం బ్రియంబు గలుగ వరుణుఁడున్. ౭౯

క. ఈవిధమున నొకరొకరే
యావధువును బెట్టపట్టునతఁ డెవ్వండో
యేవిధమున నెఱుఁగక బహు
భావంబుల వరము లీయఁ బ్రతినలు సల్పన్. ౮౦

చ. ఉవిద వరింపఁగోరి మన
ముబ్బున నూటల నూరుచుండఁగాఁ
బ్రవిమలగాత్రిసంగతికి
భావజుఁ డబ్బులు సాఁచఁజేయుఁగా

దివిజులభర్త కోరికలు
తీరనియీరిక లెత్తుచుండఁగా
వివశత నుండె ; నంతట సు
విస్ఫుటభంగిని బల్కె బ్రహ్మయున్. ౪౮

మ. "చతురంభోధిపరీతభూవలయమున్
సమ్యగ్గతిం జుట్టి యే
చతురుం డీయెడ కేఁగుదెంచుఁ దొలుతన్
సంరంభియై యాతఁడే
పతియౌ నీపరిపూర్ణసుందరికి నా
భవ్యుండె యీకాంతను
స్థితశృంగారపయోధికిన్ విధుఁడు భా
సిల్లున్ దదాకేళిలో. ౪౯

ఆ. వనిత వలచువారు బయలుదేఱుఁడు వేగి
రంబె భూప్రదక్షిణంబునకును
జాల మేల సేయ సంసిద్ధ మగుఁ డింక
నిదియె నిశ్చయంబు విదితముగను." ౫౦

మ. అనినం గొందఱు మోముఁదమ్ములను నా
హా ! వాల్చఁగాఁ జొచ్చి "యే
మనినన్ లాభ మదేమి లెండు నడువుం"
డంచున్ బ్రయాణంబు గా

బ్బున నూనంగఁ దొడంగఁ గొంద” అకటా!
మోసంబు మోసం బనన్
వనజోద్భూతుఁడు పల్కె నందఱకు వా
క్ర్యైచిత్రి తోరంబుగన్. ౫౧

చ. “వనిత వివాహమూడుమతి
వర్ధిలువారలు వేగమే చనం
జను భువిఁ జుట్టివచ్చుటకు
సాధ్యము కాదు మఱొక్కరీతి నీ
వినుతగుణాంబురాశి సతి
విశ్రుతరూపను గైకొనంగ నో
పనిజను లుండిపోయి కన
వచ్చు నహల్యవివాహ మాపయిన్”.౫౨

చ. అని పలుకంగ నాసభ జ
నావళిఁ బెక్కురు తీవ్రకాంక్ష న
య్యనుపమసుందరిన్ బడయు
నాస గమించిరి భూప్రదక్షిణం
బునకు హరీశులున్ మఱియుఁ
బుణ్యబుభుక్షులు గౌతమర్షి యున్
జన కట నిల్చియుండిరి వ
శంవదచిత్తులు వీతరాగులై. ౫౩

ఉ. భూతభవిష్యదర్థములు
పొందిక మీఱ నెఱింగినట్టియా
పూతఋషీశ్వరుల్ తలిరుఁ
బోఁడులకై ఘనమాయఁ జిక్కువా
రే! తలపోయ జ్ఞానము న
హీనవివేకము వారిపాలె యా
జ్ఞాతము వారికిన్ సకల
సంగతులున్ బహుకర్మమర్మముల్. ౫౮

గీ. మణులలోపల నాయకమణిని బోలి
తారకలలోనఁ బూర్ణచంద్రునిఁ బోలి
ఋషులలో రూపయౌవనశ్రీలఁ బొలుచు
గౌతమర్షి నహల్య యుత్కంఠఁ గనియె. ౫౯

చ. కని కనినంతనే పరమ
గాఢము గాఁగ నహల్యలేయెడం
దను నవమన్మథుం డనఁగఁ
దన్మయరూపుఁ డనంగ దివ్యదీ
క్షను విలసిల్లుశర్వుఁ డనఁ
జాలినగౌతమమౌనిరూప ము
చ్ఛ్రనఁ బడినట్లు హత్తుకొని
చొచ్చుకొనెన్ దుదియంచుఁదాఁకఁగన్. ౬౦

మ. జనియించెఁ బులకల్ శరీరమున హె
చ్చంజొచ్చె స్వేదంబు కం
పనముం గల్గెను సాత్త్వికోదయమునన్
భామామణిశ్రేష్ఠమే
యనఁగా నొప్పునహల్యకున్ దలఁపఁగా
నాబ్రహ్మలాలాటలే
ఖను గల్గుంగద ! బంధుబంధము లస
త్కామంబు మోహంబునున్. ౫౭

క. సకలము నెఱిఁగిన నెఱజా
ణకదా ! గౌతముఁడు కాన నా కేల ? పడం
తుక దక్కె నతని కనియెడు
నకలుషహృదిత్త్వోఁడ నుండె నజ్ఞానుఁడున్. ౫౮

సీ. సాక్షాత్కరించిన సత్యతేజం బనఁ
బుంభావమైనట్టిపుణ్య మనఁగ
మానవరూపబ్రహ్మజ్ఞాన మనఁగఁ ద
పోలక్ష్మి పురుషుఁడై పొడమె ననఁగ
ధర్మదేవత లసత్కారుణ్య మంది మా
నీశ్వరురూపున నెసఁగె ననఁగ
బ్రహ్మతేజంబు తత్త్వశ్రీయుఁ గవగూడి
పురుషరూపంబును బొందె ననఁగ

గీ. దివ్యసౌందర్యరాశియై తేజరిల్లు
నమలనైష్ఠికబ్రహ్మచర్యవ్రతుండు
పరమపావనజీవన భాజనుండు
గౌతముండు నిర్దగ్ధమహాతముండు. ౫౯

మ. తనకున్ వేదమయప్రపంచమునఁ దా
త్పర్యంబు మిన్నందఁగాఁ
గనుఁగొంచున్ బహుపూజనీయయు జగ
త్కల్యాణసంధాత్రి నా
వినుతిం బొందిన కామధేనువు జగ
ద్విఖ్యాతగోమాతృ దే
విని భక్తిప్రతిపత్తులన్ గొలిచి కా
వించెన్ నమస్కృత్యముల్. ౬౦

మ. శుచియై గోవుఁ బ్రదక్షిణించెడిమహా
శుద్ధుండు పుణ్యాత్ముఁడై
యచిరం బందు సమస్తభూవలయ మ
త్యంతాస్థతోఁ జుట్టివ
చ్చుచరిత్రాత్ముఁడు పొందుసత్ఫలము స
త్స్మృత్యర్థవిశ్వాసియై
యచలద్భక్తిఁ బ్రదక్షిణించె ముని
భవ్యస్ఫూర్తి గోమాతకున్. ౬౧

క. "గోమాత పరబ్రహ్మము
గోమాతయె సకలకామ్యకోటిప్రదయా
గోమాతృగర్భమందున
క్షేమంబున నుండు సకలసృష్టి తలంపన్. ౬౨

క. గోవులు పాలుపొందెదునా
తావుల వసియించు దేవతాగణములు న
చ్చో వెలయు సర్వతీర్థ
శ్రీవితతియుఁ గానఁ గొలుతు శ్రీగోగణమున్. ౬౩

క. సుధఁ బోనిక్షీర మొసఁగుచు
క్షుధఁ బాపుచు సకలలోకశోభాకరతఁ
వ్యధ దీర్చి ప్రోచుచుండెడి
ప్రథ గలగోమాత! నీకు వందన మమ్మా! ౬౪

క. గోలోకవాసి విష్ణువు
గోలోకమె సర్వలోకగుప్తము శోభా
శ్రీలసితము గోలోకము
గోలక్ష్మిగఁ గొలుతు సతము గోమాత! నినున్. ౬౫

క. ముదమున భక్తిని నిన్నుం
బ్రదక్షిణించెడుజనుండు పడయుం బరమం
పద మన ధరిత్రి శతధా
ప్రదక్షిణించినఫలంబుఁ బడయుట లరుదే?" ౬౬

గీ. అనుచు నతిభక్తి గౌతముం డంజలించి
గోప్రదక్షిణ మొనరించి కొసరి కొసరి
మధురగంభీరభాషల సుధలఁ గురిసి
మ్రొక్కె నతిభక్తి నావిష్ణుమూర్తిమ్రోల. ౬౭

క. "పదునాలుగుభువనంబులు
నుదరంబునఁ దాల్చియున్నయుజ్జ్వలమూర్తిన్
సదయాంతఃకరణుని నే
మదుసూదనుఁ గొల్తు సకలమంగళకరునిన్. ౬౮

క. ఉరమున లక్ష్మి వెలుంగఁగఁ
గరముల శార్ఙ్గంబు శంఖగదలును జక్రా
భరణంబు లొప్పఁ గౌస్తుభ
మిరవొందెడువిష్ణుమూర్తి నెంతయుఁ గొలుతున్. ౬౯

క. శిష్టజనరక్షణంబును
దుష్టజనవినాశనంబు తో నొనరింపన్
శిష్టులకడుపునఁ బుట్టువి
శిష్టునిఁ బ్రణుతింతు విష్ణు శ్రీసంయుతునిన్. ౭౦

క. దయగలిగి భక్తజనములఁ
బ్రియమునఁ గాపాడువ్రతము పెంపెసఁగఁగ న
ప్రియదూరుఁ డగుచు వెలిఁగెడు
భయనాశను విష్ణుమూర్తి భక్తిం గొలుతున్. ౭౧

క. సర్వమునందును దానుగ
సర్వముఁ దనయందు వెలుల శాశ్వతుఁ డగునా
సర్వాత్ము హృషీకేశుని
సర్వామరసేవ్యుఁ గొలుతు సమ్యగ్భక్తిన్." ౭౨

గీ. అనుచు హరిభక్తి నవశుఁడై యద్వితీయ
మధురమంజులవాక్కుల మాధవుగ స్తు
తించి యతనికటాక్షదీధితిఁ దరించి
శంభునకు మ్రొక్కి భక్తిని సంస్తుతించె. ౭౩

క. "కమనీయకాలకంఠము
రమణీయకపాలపాత్ర రమ్యజటాసం
తమసంబు నెత్తి జాహ్నవి
యుమ హామేనం గలట్టియుజ్జ్వలుఁ గొలుతున్. ౭౪

క. మెడఁ బునుకలపేరును గెం
జడముడిలో జాహ్నవియును జంద్రాంకము నా
యొడలంత బూదిపూఁతయుఁ
బాడపాములఁ దాల్చుశివుని భూషింతు నెదగ. ౭౫

క. మంగళిసంధాయకుఁడై
బంగరఘనగొండవింటి బల్లోదుచునై
యంగజభవు క్షణమున భ
స్మాంగుని గావింపఁ గన్నయభవు నమింతున్. ౭౬

క. సర్వామరసంస్తుత్యుని
శర్వుఁ ద్రిపురారిఁ బరము శాశ్వతు రుద్రున్
సర్వజగత్ప్రళయాంతకుఁ
బర్వతవరరాజపుత్త్రిపతి భజియింతున్. ౭౭

క. శంకరు నపవర్గప్రదుఁ
గింకరజనవరదు దేవు క్షేమంకరు దు
శ్శంకాతంకవిహారు భ
యంకరు నభయప్రదాత్ర నభవు నమింతున్." ౭౮

గీ. అనుచు గౌతముఁ డతిభక్తి నాదిశంక
రుని నుతింపఁ గృపామయుం డనఁగ నతఁడు
కరము వాత్సల్యదృష్టి వీక్షణముసేయ
నిలచియుండె గౌతముఁడు నిర్నిమిషదృష్టి. ౭౯

ఉ. అంతట బ్రహ్మదేవుఁడు కృ
పాంబుధిసోముఁడు పల్కె మౌనితో
"సంతసమయ్యెనయ్య! ముని
చంద్రమ! నీవె జయించినాఁడ వీ
కాంతకరాంబుజంబుఁ ద్రిజ
గజ్జను లచ్చెరువంద; నెవ్వరే
నింతటిధర్మసూక్ష్మము గ్ర
హింపఁగఁ జాలిరె! నీవు దక్కనన్. ౮౦

ఉ. గోవుఁ బ్రదక్షిణించుటను
గొంటివి భూమిప్రదక్షిణంబు శో
భావహసత్ఫలంబుపది
యంతలు పిమ్మటఁ బంకజాక్షు స
ద్భావముతో నుతించి మఱి
ధన్యుఁడవైతివి పైని బార్వతీ
దేవిపతిన్ నుతించి గను
తింపఁగరానిఫలంబు నందితో. ౮౧

చ. నిరుపమ మాత్మ్వదీయ ఘన
నిష్ఠను నుత్తమసద్వ్రతంబుగాఁ
బరగినబ్రహ్మచర్యపరి
భావితదీక్షను ఘోర మాతపో
గరిమను సర్వసద్గుణాని
కాయమనోహరరూపసంపదా
కరునను నీక యన్నిటను
గాంత యహల్య తగున్ నిజంబుగన్."

ఉ. అంత సరస్వతీరమణి
యానతిఁ గాంచి యహల్య విస్మయా
క్రాంతమనోహరాననము
కందును గుందును లేక చెల్వమై

యెంతయు శోభఁ బెంపఁ గది
　　　　యించినదోయిలిఁ బూలమాల న
త్యంతముభక్తి గౌతముని
　　　　యఱ్ఱున వైచె నిజార్పణంబుగన్. ౮౩

చ. జయజయనాదముల్ దశది
　　　　శల్ విననాయెను దేవదుందుభుల్
ప్రియముగ మ్రోఁగెఁ బుష్పసుమ
　　　　వృష్టి నిరంతరమై చెలంగె వా
క్ప్రియసుమముల్ మునీశ్వరులు
　　　　పెల్లు కురించి నుతించి రాయహ
ల్యయుఁ గడు నొప్పెఁ జంద్రునిస
　　　　మాగమముం గనురోహిణిక్రియన్. ౮౪

గీ. చంద్రచంద్రికలట్లు పుష్పంబుసౌర
భములచందాన శుక్తిరత్నములగతిని
నపు డహల్యయు గౌతముఁ డలరఁ జూచి
హర్షవార్నిధిఁ దేలె సభ్యగణమెల్ల. ౮౫

గీ. స్వస్తివాక్యవిభూషల సర్వబుధులు
చల్లిరి శుభాక్షతంబు లాజంటమీఁద
హరిహరాదులు నాశీః ప్రహర్షణములఁ
బావనులఁ జేసిరి నవవధూవరులను. ౮౬

చ. నలువ యనంతకౌతుకము
నం గని సభ్యులం బల్కె నంత "నో
సలలిత తేజులార! శుభ
సంపద పొంపిరివోవ గౌతముం
డలఘుతపోధనుండు పతి
యయ్యె నహల్యకుం బుణ్యసాధ్వియై
యిల మను నీమె పేరలు గ
డింతురు శాశ్వతదివ్యకీర్తులన్. ౮౭

మ. సకలంబున్ సమకూర్చి యుంచితి యశ
స్సౌభాగ్యసంపన్నదా
యక మారీతి వివాహ మిచ్చుటనె చే
యంగావలెన్ నేఁడె తా
వక సౌహార్దము నూఁతకోలఁగ గడిం
పం గాంచితిన్ మీర లీ
సకలంబున్ సుకరంబుగా నడిపి య
స్మత్ప్రీతి గావింపుఁడీ! ౮౮

గీ. ఉండవలసినవారలే యున్నవార
లిట శివుండును హరియు నన్నింతవానిఁ
జేసి కరుణించి యున్నారు శివయు రమయు
మనకుఁ బెన్నిధులై ప్రోవఁగనినవారు. ౮౯

క. ఇంద్రాదులు దుర్విధిని
  స్తంద్రులు గాలేక భూప్రదక్షిణమునకై
  తంద్రత నేఁగి రసూయా
  సాంద్రులు వారుంట నిట నసభ్యమె తలఁపన్." ౯౦

క. అని పలికిన నందఱు నౌ
  నని పలికి వివాహవిధికి నభ్యుద్యతులై
  నను వాణి యహల్యను గై
  కొని యేఁగె వివాహవిధులకుం గయిసేయన్. ౯౧

చ. జగములకర్త యాకమల
      సంభవుఁ డెంచిన నెంతమాత్ర నే
  సుగతులఁ జూపఁజాలఁ డతి
      శోభనుఁ డాతనిలీల యద్భుతం
  బగుఁగద! చిత్రచిత్ర మిది
      యంతయుఁ జూడ క్షణంబులోన నా
  జగదధినేత సర్వముఁ బొ
      సంగఁ జేసెను మంగళార్థమై. ౯౨

చ. పలుకఁ దలంప దవ్వె యగు
      బ్రహ్మసభాభవనంబునందుఁబు
  ణ్యులు నగుబ్రహ్మవాదిపుల
      యొద్దను లోకము లేలువిష్ణుశ

ర్వాలకడుసన్నిధానమునఁ
బుణ్యాజగత్త్రయమాతృదేవతా
వలికడ, దివ్యసుందరి వి
వాహము గాతముఁ డెంతధన్యుఁడో! ౯౩

చ. ఒకటియె యిందుఁ జూడఁగ మ
హోన్నతభాగ్యము నందులోన నీ
సకలముఁ గూడినన్ దలఁప
శక్యమె! యోగము భోగమున్ మహో
త్సుకతయుఁ గోటికోటిశత
సుందరజన్మలనైనఁ గాంచఁజా
లకకద యాసచేసిరి త
లంప మహేంద్ర సురాదు లెల్లరున్. ౯౪

గీ. ఎవని కెంతటియోగ మేపవిదిఁ గలుగు
నో యెఱుంగ నసాధ్యంబె యూహచేయ
వాణి యుమయును లక్ష్మియుఁ బరమకృపను
దీర్చిదిద్ది రహల్యా నుదీర్ణభంగి. ౯౫

క. మంగళ మగునభ్యంజన
మంగనకుం జేసి కురుల నారిచి మృదుసం
పెంగపునూనియ దువ్వెరి
ముంగురులన్ గురుల మదనుమోహపుటురులన్. ౯౬

క. నుదుటను గుంకుమ రేఖయుఁ
బదములఁ బారాణిఁ గీలుపఱచి రహల్యా
సుదతీమణికిని బుగ్గను
జదిమిరి కస్తూరిచుక్క (శ్రీ)పార్వతులున్. ౯౭

క. గౌతమమహానియు శుభసు
స్నాతుండయి తత్తదుచితసంపదతోడన్
బూత యగునాయహల్యా
పేతుండై పెండ్లిపీటఁ బ్రియమున నుండన్. ౯౮

మ. పుటముల్ దీఱుసువర్ణవర్ణములపెం
పుంబోనిమైదీవ లు
త్కటసుజ్ఞానమయూఖమాలికల నే
త్రద్వంద్వముల్ పూర్ణవి
స్ఫుటజృంభంబులు నౌముఖాంబుజములున్
శోభాస్పదం బౌచు మి
క్కుటమై దంపతులన్ సమానముగ నే
కూర్చెన్ సమస్తంబునన్. ౯౯

మ. జగదత్యద్భుతభంగి నుత్తమమహా
శాస్త్రానుసారంబుగా
జగదభ్యర్చితు లామహాఋషీశుల ప్రశం
సాపూర్వతన్ సర్వస

నిగ మోక్తంబుగఁ బార్వతీశివులు వా
ణీబ్రహ్మలున్ మాధవుల్
నెగడం జేసి రహల్యకున్ మునికిఁ బె
ండ్లిన్ దివ్యమార్గంబునన్. ౧౦౦

సీ. సకలవైవాహికసంగతుల్ నడిపించి
రమలమానులు బ్రహ్మలై కడంగి
శ్రీశ్రీమనోహరుల్ శ్రీపార్వతీశివుల్
వరవితానము లిచ్చి తరలి చనిరి
వాణీమహాదేవి పరమవత్సలతతోఁ
గన్నకూఁతునిభంగి గారవించి
బ్రహ్మదేవునియానఁ బరమసంతోషంబు
తో నహల్యకు సర్వతోశుభంబు

గీ. లొసఁగి దీవించి మన్నించి యొనర నొప్ప
గించె గౌతమహూనికి నంచితముగ
నజుఁడు దంపతులను గడు నాదరించి
వత్సలత మీఱఁ బెక్కుదీవనలు గురిసె. ౧౦౧

క. గౌతముఁ డంజలిమై యు
ద్ద్యోతితభక్తిని నుతించెఁ దోయజగర్భున్
స్వాతంత్ర్యప్రియభాషల
పీతాఖిలరాగబోధవిభవోజ్జ్వలుఁడై. ౧౦౨

క. "సృష్టిసమస్తంబును బరి
పుష్టిఁ నడిపించి జగముఁ బోషించెడి సం
స్రష్టవు కమలజ! భక్తి న
భీష్టప్రదు నిన్నుఁ గొలుతుఁ బ్రియ మగుభంగిన్. ౧౦౩

క. నిగమంబులు సుగమంబుగ
నగుమోముల నలరుచుండ నలుమోముల నీ
కగు లీల లెల్లభంగుల
నిగమాఖిలభద్రమూర్తి! నిను సేవింతున్. ౧౦౪

క. లీలార్థమునాకౌఆ కీ
లీలఁ వనితఁ సృజించి లీలాలోలా!
నీలోకదర్శనోత్సవ
శ్రీలం దేల్చినమహాత్మ! సేవింతు నినున్. ౧౦౫

క. తమతమపుణ్యంబుల కు
త్తమఫలము లొసంగఁగాదె దయదలఁచి యిటుల్
సుమనోభిరంజకంబుగ
నిమిత్తమాత్రం బహల్య సిల్పితి దేవా! ౧౦౬

క. సురలను మించెద రుత్తమ
నరు లని చాటంగఁ గాదె నాకౌకసులఁ
వరభూప్రదక్షిణం బను
నుసుమిషఁ బోఁద్రోలినాఁడ వో దేవ! కృపన్." ౧౦౭

గీ. అనుచుఁ బ్రార్థించి యా దేవునమలహాస
భాసురకటాక్షరూపమహాసుఖంబు
ననుభవించి సరస్వతీవనితపాద
పద్మముల వ్రాలి కీర్తించె బహువిధముల. ౧౦౮

క. "నలువకు నలువదనంబుల
విలసిల్లుచు నిగమరూప వేద్యవునై నీ
లలితకటాక్షముఁ గనకే
పొలియును జగ మంబ! నిన్నుఁ బూజింతు మదిన్.

క. సంగీతము సాహిత్యము
నుం గుచములు నీకుఁ దక్కనుం గలకళలే
యంగంబులు తలఁపంగ ని
నుం గవులే యెఱిఁగి కొల్వ నోతురు వాణీ! ౧౧౦

క. కచ్ఛపిఁ గైకొని నీవాక
స్వచ్ఛపుగీతంబుఁ బాడ జగములు దేవీ!
యచ్ఛిన్నం బగుసౌఖ్యశు
భేచ్ఛన్ నటియించు నమ్మ! యిగురుంబోఁడీ! ౧౧౧

క. కక్షవాత్సల్యముతోడను
బడఁతి నహల్యను గణించి బంధుప్రేమన్
గడిమి మెయిఁ దీర్చిదిద్దుట
సడలని కారుణ్యదృష్టి సత్యము తల్లీ! ౧౧౨

క. చదువులరాణియుఁ బతియును
మదికొదవలు దీర్చి మమ్ము మన్నించి రసన్
దుదిమెట్టు జెంత మే మిఁక
సదయామయి! కరుణఁ జూడు సంతతము మమున్". ౧౧౩

చ. అని బహుభంగు లిట్లు కొని
యాడిన వాణియు బ్రహ్మయుఁ గృపా
వినమితులై మునీశ్వరునిఁ
బెక్కువిధంబుల నెన్ని యాయహ
ల్యను మఱిగ్రుచ్చిగ్రుచ్చి కడు
నాదర మొప్పఁ గవుంగిలించి దీ
వనలఁ గురించి, వీడ్కొలిపి
పంపిరి తక్కుసదస్యు లందఱున్. ౧౧౪

సీ. షోడశకళలచే సుందరతరుఁ డయ్యు
రోహిణీసౌందర్యరూఢిఁ గాంచి
సుందరతముఁ డైనచందురుండో యన
ఛాయాసమేతుఁడై సరళకాంతి
దేదీప్యమానుఁడై తీవ్రత లేనట్టి
పగిదినొప్పెడుమహాభానురీతి
రతిదేవిఁ గూడినరమణమన్మథుఁ డనఁ
బార్వతిం గూడినభర్గుభంగి

గీ. ముద్దునగుమోము మోహినీమోహినీత్వ
మొనరఁ దాల్పఁగ యోగ్యతావినత యైన
సురుచిరసురూపసుందరి శోభితాంగి
యానహల్యతో గౌతముఁ డలరె మిగుల. ౧౧౫

మ. నిజజన్మాదిక హేతుభూతుఁ డగువా
ణీనాథుఁ బల్మారు భ
క్తి జనింపన్ గొనియాడియాడి తనమా
తృశ్రీని వాణిన్ స్తుతి
వ్రజసంపత్తిని బ్రీతఁ జేసి మఱి "యం
బా ! దివ్య మాకింక నీ
యజుఁడున్ నీవసుమీ నిరంతరము నా
హ్వాయంబునన్ బ్రోవఁగన్." ౧౧౬

క. అని పలుకుచు బలువగలన్
బనవుసహల్యను మఱెంతవాత్సల్యముతోఁ
బనిపిరి వాణియు నజుఁడును
బనుపడ వెవ్వారి మోహబంధము లోకటన్ ! ౧౧౭

మ. త్రిజగత్సుందరి యానహల్యను మహో
దీర్ణంబుగాఁ గూడి తన్
సుజనానీకము సంస్తుతింపఁగ మహా
శుద్ధాత్ముఁడై రాగమో

హాజలోభంబులఁ గాంచకే చనియె స్వీ
యంబైనదివ్యాశ్రమ
ప్రజనస్థానముఁ గాంచ గౌతమమహా
ప్రఖ్యాతమౌనీంద్రుఁడున్. ౧౧౮

ఉ. ఉత్తమయోగివంద్య! పర
మోత్తమయోగనిధాన! యుత్తమా
త్యుత్తమ! త్యాగిరాజ! సుగు
ణోత్తమరాజిత! బ్రహ్మవర్యజా
త్యుత్తమ! యుత్తమోత్తమమ
హోత్తమబోధక! దివ్యనాదస
ర్వోత్తమగాయకా! యతిమ
హోత్తమభావుక! లోకబాంధవా! ౧౧౯

క. శరణాగతరక్షణస
త్పరమవ్రత! వ్రతనిధాన! భాగ్యాఢ్యక్షా!
కరుణాకర! పరమాదర!
సరళాత్మకహృదయ! పరమసంసృతిదూరా! ౧౨౦

క. ఋషిగణగుణాపహారీ!
ఋషిధర్మపవిత్రచరిత! ఋషివరవర్యా!
ఋషిచంద్రమ! ఋషిరాజా!
ఋషిగణపరివృతా! పరమేశ్వరరూపా! ౧౨౧

గద్యము. ఇది శ్రీగురుకటాక్షలబ్ధకవిత్వ గౌతమసగోత్రపవిత్ర
బులుసు వేంకటేశ్వరప్రణీతంబైన శ్రీమదహల్యా
గౌతమమున ద్వితీయాశ్వాసము.

శ్రీగురుభ్యోనమః

# అహల్యాగౌతమము

—:o:—

## తృతీయాశ్వాసము

శ్రీమద్బ్రహ్మజ్ఞాన
శ్రీమద! శ్రీమదనిరస్త! శ్రీమహనీయా!
శ్రీమాన్యార్చితపాద
శ్రీమహితా! పరమపురుష! శ్రీగురుదేవా! ౧

వ. "సూతమహర్షీంద్రా! తదనంతరకథాక్రమం బెట్టి? దయ్యింద్రాదులేమైరి? వారేమి భావించిరి? అయ్యహల్యాగౌతముల యాశ్రమజీవనవిశేషము లెవ్వి? తెలుపఁగదవే!" యని ప్రార్థించినఋషులకు సూతుఁ డిట్లు చెప్పఁదొడఁగె: ౨

చ. నదులను దాఁటి పర్వతవ
నంబుల నెల్ల నతిక్రమించి మో
హదురభిమానులై మదుల
హల్య వరింపఁగ వేగిరింప ను

స్మదులయి ప్రాణవేగమున
ధారుణి యెల్లఁ బరిభ్రమించి క
ట్టెదుటను గాంచి రెల్లరుఁ గ
డిందితపోధను నారదర్షినిన్. 3

ఆ. పూసిగ్రొండి గాన మూఁడులోకంబుల
వార్త లెల్లఁ జెప్పువాఁడు గాన
చల్లగా నతండు చావుకబురు చెప్పి
చనిన వార లెల్లఁ జతికిలఁబడి. ర

క. ఇంద్రాదిదివిజపతులును
సాంద్రం బగుకోపవహ్ని స్రగ్గుచు వలపుల్
సంద్రంబులోన మునిఁగిన
యింద్రియవృత్తుల మనంబు లీసులు గొల్పన్. ౫

ఉ. ఎంతటిమోసమాయె మన
కింతటిఘోరపరాభవంబు దు
ర్దాంతుఁడు బ్రహ్మ చేయఁగఁ గ
తం బది యేమి? కటా! తలంపఁగా
స్వాంతము లాసరోజముఖిఁ
బాయుట యెట్లు? లేఁకే మొనర్చినన్
బంతము చెల్లె బ్రహ్మకును
బండెను బుణ్యము గౌతమర్షికిన్. ౬

గీ. కమలసంభవుఁ గాదని గౌతమర్షిఁ
గాదని యొనర్పఁ దగినది లేదు మనకు
నింతకాను నట్టిమదవతి యింతి మనకుఁ
గాకపోయెను దౌర్భాగ్యకారణమున. ౮

ఉ. ఐనను బద్మసంభవుఁడై
యట్టియహల్యను సుందరాంగుఁడే
యైనను మర్త్యనొక్కనికి
నంటఁగఁ గట్టుట యెట్టిచెట్ట? యు
వ్వానివివేకహీనత ప్ర
పంచము నెల్లెడఁ దెల్లమౌఁగదా!
వీనికి సృష్టికర్తను
విష్ణుఁ డొసంగుటఁ దప్పు వానిదా! ౯

గీ. అరసికశేఖరుఁడౌఁగదా! యజుఁడు తలఁప
దివ్యసుందరి కొడగూర్చు దిస్టిపిడుత
యగుదరిద్రుని, నటులె గయ్యాళిగంప
వికృత మన్మథరూపుతోఁ బెండ్లిసేయు! ౧౦

క. కట్టక పెట్టక ముట్టక
పొట్టను బూజించుమూర్ఖుఁ బొడఁగని యంటం
గట్టును సమస్తసంపదఁ
బెట్టెడు పుణ్యునకు నింతపిండవుఁగూడున్. ౧౧

గీ. అత్త కొట్టిన దనుబాధకంటెఁ దోడి
కోడలే దెప్పె ననుమాట చూడ బాధ
మనకు నగుఁబాటు జగముల మాన దింక
శివశివా! యెంతకర్మంపుఁ జెట్ట! యనుచు. ౧౧

క. అదవద లొందవఁగ మనులం
దు దహింప నసూయ మతులఁ దోడ్తో దుఃఖా
స్పదులయి తమతమ నెలవులఁ
గదిసిరి వారెల్ల సమధికం బగువగలన్. ౧౨

వ. అంత నట నహల్యాగౌతములు. ౧౩

సీ. రాకాసుధాంశునిరాకచే లోకస
మ్మోదవార్నిధులు నుప్పొంగునట్లు
ఆయహల్యాగౌతమాగమనంబుచే
వనతలం బయ్యె శుభప్రదంబు
పికములు శుకములు ప్రియబంధుజనములై
స్వాగతవాక్యముల్ చదువఁ దొడఁగె
కరిణీగణంబులు హరిణీచయంబులు
జరపె గృహప్రవేశంబు నాఁడు

గీ. అచట శతశృంగగిరి యనునాశ్రమంబు
నందు గౌతముఁ డతివతో విందుగుడిచి
స్వీయగార్హస్థ్యధర్మంబు చేయగడఁగెఁ
బరమసాధ్వి యహల్యతో నిరుపమముగ. ౧౪

గీ. క్షీరనీరములట్టులఁ జెలఁగి మెలఁగి
చిలుకగోరింకలపగిదిఁ గలసిమెలసి
యమలహరిద్రచూర్ణంబునట్లు రాగ
రంజితంబుగ సంసారరాజ్యమందు. ౧౫

ఆ. అతఁడు చక్రవర్తి యగునామె రాజ్ఞియు
సకలసంగతులను జరపుపట్ల
నాత్మరాజ్యమందు నైరంతఁ బట్టాభి
షిక్తు లంత రరులు చెడి నశింప. ౧౬

సీ. చిగురుఁబోఁడిపదాబ్జసేవచేఁ జెట్లచి
గుళ్లు గడించెను గోపతలను
అరవిందనయనసత్కరుణచే గడియించెఁ
బద్మజాతి వికాసపరిభవంబు
రంభోరుసుస్నిగ్ధరమ్యోరుసేవచేఁ
గదళి కాంచిన దెల్లగరగరికయు
లలితాంగిమైఁదీవఁ గొలువఁగాంచియె లతా
వళి గాంచె మార్దవభాగ్య మెల్లఁ

గీ. బడఁతినాసికఁ గొలిచి సంపంగి సౌర
భంబుఁ గాంచెను ; బద్మంబు పస గడించె
లేమమోమును సేవించి ; గోము వడసెఁ
జందురుఁడు నామె నగుమోముఁ జక్కఁ గొలిచి. ౧౭

సీ. పంచమస్వరములఁ బాడు మేలొ్కల్పులు
కోయిలలలనలు కూర్మిమీఱ
చమరీమృగంబు లాశ్రమభూమిఁ దుడిచి ని
ర్వర్తించు నిత్యము। బాచిపనులు
కరిణీగణంబులు కలయంపులను జల్లి
పరిశుభ్ర మొనరించు భవ్యభూమి
మృగనాభి సరిదిద్ది మృగిగణంబులు ముగ్గు
పచరించు నాశ్రమప్రాంగణముల

ఆ. జలము తాఁకకుండ జలపూర్ణకలశముల్
కరులు తెచ్చి దింపు గడపలకడ
ననుదినంబు లిట్లు లాయహల్యాసాధ్వి
సేవచేయు జంతుజీవవితతి. ౧౮

సీ. నిత్యాగ్నిహోత్రంబు నెఱవేర్చు వేళకు
సామజంబులు దెచ్చు సమిధ లేఱి
దేవతార్చన వేళఁ బూవు మొక్కలఁ ద్రుంచి
యందీయఁ జూచు సింహములు భక్తి
దర్భాంకురంబులు దళములు కొనివచ్చి
హరిణంబు లందిచ్చు ననువుమీఱ
పంచామృతస్ఫూర్తిఁ బరమభక్తిని వచ్చి
గోగణంబులు పాలు కురిసి పోవు

ఆ. నమ్మిసదుపు వచ్చి నాట్యంబు సేయుచు
పించియముల వీచి ప్రీతిఁ గూర్చు
ననుదినంబు నిట్టు లాగౌతమర్షికిఁ
దమదుజన్మము లిటు ధన్యములుగ. ౧౯

సీ. అతితీవ్రనియమధనాభివృద్ధియును ని
శ్చంచలదీక్షాప్రశస్తతయును
బంచభూతాత్మకబాహ్యదేహమమత్వ
మామూలముగఁ ద్రెంపునమృతశక్తి
కామాదిషడ్గుణక్రమవిజయంబు న
హంకారవర్జనాద్యభ్యసనము
నమలతపోదృష్టి నాత్మార్పణంబున
నాత్మసామ్రాజ్యసింహాసనాధి

గీ. పత్యసంపాదనముఁ దమభవ్యజీవి
తాద్భుతాదర్శములు గాఁగ నలరుచుండు
నాపవిత్రదంపతులగృహస్థధర్మ
నిర్వహణపద్ధతి నుతింప నేర రెవరు. ౨౦

క. కాలము కర్మము కూడను
బాలింపఁగ వలసివచ్చె వారియభీష్టం
బేలీల నెంచి చూచినఁ
గాలవశులు కాక వారు కాంచిరి జయమున్. ౨౧

క. శీతము వాతము నాతప
మేతరుణమునందు వారి నెదురఁగ లేకే
ప్రాతవడి సేవచేయఁగ
నే తలపోయుఁ వారి జయింపఁగఁ గనమిన్. ౨౨

క. అతిపూతభావసంయుతు
లతిపూతసుజీవనామలాదర్శులు స
త్ప్రతిభాభియోగ్యు లగుదం
పతు లతిలోకప్రభావ భావుకు లగుటన్. ౨౩

క. అసదృశము నపూర్వము నయి
యొసఁగుం దలపోయ వారియిహజీవన మిం
పెసలారు తత్త్వసంపద
గ్రసియింపఁ దమోమయాత్మకం బగుప్రకృతిన్. ౨౪

సీ. పరమపాతివ్రత్యభావంబుఁ బరికింప
దయ లేక శిక్షించుఁ దరుణి నొకట
దేహిదేహవిభేదదివ్యవిజ్ఞానంబు
నాఁటఁజేయఁగఁ దన్ను నాతి నొకట
క్షుత్తృష్ణవిజయవిశుద్ధసంపద నింప
నిప్పస్తులుండఁగా నేర్పు నొకట
నింద్రియలాంపట్య మిసుమంత లేకుండ
బహునియమంబులు పన్ను నొకట

గీ. పుటము వెట్టినబంగారు పులు నశింప
దివ్యదీధితి నెంతయుఁ దేజరిల్లు
నటు లహల్య బంగరుబొమ్మ యాత్మవేది
గౌతమస్వర్ణకారుచేఁ గాంచు మెఱుఁగు. ౨౫

ఆ. పరమరత్న మనఁగఁ బరగునహల్య సం
సార మనెడుగొప్పసానమీఁద
గౌతమర్షి యనెడుఘనరత్నకారుచే
సానదీఱి కాంతిసంపదఁ గనె. ౨౬

సీ. పరమయాతనలలోపల మహానందంబుఁ
జూఱఁగొనెడి నేర్పుఁ జూఱయిచ్చి
కాయకష్టములలోఁ గమనీయసౌఖ్యంబు
ననుభవించెడివిద్య ననువుపఱచి
యింద్రియవిజయంబునందె బ్రహ్మానంద
మందఁజాలెడు నేర్పు పొందఁ జూపి
యాత్మానుసంధానితావ్యయానందభా
గ్యంబునవిలసిల్లుకరణిఁ దెలిపి

గీ. పరమపరిపూత మగుప్రేమభావమునను
బ్రణయపరమావధిగ శిక్షఁ బడయఁజేసి
యవ్యయానందశృంగారహావభావ
విలసనంబుల సతిఁ దీర్చె నలఘుమౌని. ౨౭

ఉ. అంతము లేని ప్రేమమున
నారయుచున్ బతి దేహధర్మదు
ర్దాంతతమోవిదూరతకు
దండన చేసిన వేళలందు సు
స్వాంతసరోజజృంభణవ
శంవదయై యరుసించుఁగాని యా
వంతయు వంత నొందక య
హల్య పతిం గొనియాడు భక్తిమై. ౨౮

గీ. బ్రహ్మవరమునఁ బుట్టుటవలనఁ గాదు
వాణిదగ్గఱఁ బెరుఁగుటవలనఁ గాదు
గౌతమజ్ఞాననేత్రశిక్షణమువలన
నింతి తా నింత యౌటని సంతసించు. ౨౯

క. ఉగ్రతపస్సంపన్నత
నుగ్రాత్మకపతిపదాబ్జయుగళీసేవా
వ్యగ్రత నేమఱకుండ స
మగ్రం బగుభక్తిఁ గాంత యధిపు భజించున్. ౩౦

క. పొరపాటు లేవిథ్యైనను
బరికించుచు శిక్ష సేయఁ బరికించెడియా
వరమౌనిపరీక్షలలో
సురుచిరవిజయంబుఁ గాంచె సుదతి కరంబున్. ౩౧

క. అతిశీతవాత వేళల
సతి నద్దమరేయి లేపి చయ్యన శిష్య
వ్రతతులు వచ్చిరి వేలుగ
నతివేలము వండి పెట్టు మని శాసించున్. 3౨

క. సతి యెల్ల సిద్ధ మొనరుప
"నతివా! వచ్చెదరు జే" పటంచును బలుకన్
సతి "చిత్త" మనుచు వినయము
నతివేలము చూప "మెచ్చి" తనుఁ దద్భక్తిన్. 33

క. ఇది యేమి యనక నా కిది
కుదుర దనక భర్త యేమి కోరిన నది పెం
పొదవఁగఁ జేయుచు సతి పతి
మది కెక్కి పతివ్రతాత్వమాన్యతఁ గాంచెన్. 3౪

సీ. సతియును బతియును సద్గోష్ఠి నుండంగ
రేయిందివంబులు పాయుచుండుఁ
బతితపశ్చర్యలో సతిమహాదీక్షలో
వత్సరంబులు క్షణభంగురల మగు
శీతవాతాతపాశేషదిగ్విజయములో
వారిని శ్రమములు చేరకుండు
భుక్తి జయించినపూతాత్ము లగుటచే
నెపుడో కైకొనుచుందు రింతకూడు

గీ. పగలు రాత్రము రాత్రమే పగలు వారి
కగుచునుండుఁ గాలాతీతు లగుట వారు
పేరు సంసారమే కాని వా రొనర్చు
కాఁపురము జ్ఞానలక్ష్మికి దాఁపురంబు. ౩౭

వ. శ్రుతిస్మృతిధర్మవిజ్ఞానలక్ష్ము లహల్యతోఁ పాటా మహ
ర్షిని వరించినకారణమున నమ్మహామహుని విజ్ఞాన
సేవాభాగ్యముఁ బడయఁగోరి కోటానఁ గోటులు
మునులు శిష్యులై యాతని సేవించుచు లబ్ధకాములై
చనుచుండ గౌతముఁడు వారిమూలమునఁ బ్రతిజ్ఞా
హేతూదాహరణాదిషోడశపదార్థనిరూపకమైనదియుఁ
బ్రథమాధ్యాయప్రథమాహ్నికమునఁ బ్రమాణాది
పదార్థనవకలక్షణ నిరూపణమును ద్వితీయాధ్యాయ
ప్రథమద్వితీయాహ్నికముల సంశయపరీక్షణాదికము
నర్థాపత్త్యాద్యంతర్భావనిరూపణమును దృతీయాధ్యా
యమున శరీరేంద్రియార్థబుద్ధిమనఃపరీక్షణమును జతు
ర్థాధ్యాయమునఁ బ్రవృత్తిదోషాదికము దోషనిమి
త్తాదికమును బంచమాధ్యాయమున జాతిభేదనిగ్రహ
స్థానభేదనిరూపణమును గల పంచాధ్యాయములతోఁడి
తర్కశాస్త్రమును గౌతమన్యాయ మను పేర లోక
మునకు సదయాంతఃకరణమునఁ బ్రసాదించి దిన
ములు పుచ్చుచుండ నొక్కనాఁడు : ౩౮

సీ. పరమభాగవతులఁ బ్రథమగణ్యుఁడు నుత్త
మజ్ఞాననిధి యయి మసలువాఁడు
నూఁఱుతంత్రులపై మనోహరంబుగ హరి
పదములు తనవీణఁ బాడువాఁడు
తనరాకచే జగజ్జనులు సంతోషింప
నెల్లలోకంబుల నెసఁగువాఁడు
పూసిగొండితనానఁ బోరులు కల్పించి
యానందగరిమచే నలరువాఁడు

గీ. కాశసంకాశధవళ మాకాయ మొప్ప
మహతి భుజమున నొనరంగ మంజులమగు
పారిజాతప్రసూనశ్శోభాయమాన
నవ్యమాలియై వచ్చెను నారదుండు. ౩౨

ఉ. వచ్చిన గౌతముండు పరి
పాటి సపర్య లొనర్ప నారదుం
డిచ్చెను మెచ్చి గౌతముని
నెంతయుఁ బ్రస్తుతిచేసి "ధర్మసం
పచ్చరితా! కటాక్షమునఁ
బల్కుఁగదే! నను ధన్యుఁజేయఁగా
నిచ్చ సమస్తలోకముల
నింపగు నాశ్రమజాతిధర్మముల్." ౩౩

క. అని యడిగినఁ గనికరమున
  ముని గౌతముఁ డఖిలధర్మములుఁ బదునా
  ల్గును నగునధ్యాయములం
  బనుపడఁగాఁ జెప్పె "గౌతమస్మృతి" యనఁగన్. ౩౯

ఉ. నారదుఁ డద్భుతంబుగ మ
      నంబున నెంతయు సంతసిల్లి త
  త్సారముఁ గాంచి గౌతముని
      భక్తిని నెంతయు సంస్తుతించి యిం
  పారెడు గౌతమస్మృతిని
      నంచితభంగి గ్రహించి పోయె వి
  స్తారము వ్యాప్తిఁ గాంచె నిదె
      ధర్మజగంబున నుత్తమంబుగన్. ౪౦

వ. ఆపిమ్మట నొకనాఁటి సాయంసమయమున : ౪౧

మ. తనతీవ్రాంశుమయూఖమాలికలచే
      తన్ లోక మల్లార్చినం
  తన కారుణ్యకటాక్షవీక్షణమునన్
      దర్పంబుఁ బోనాడి మె
  ల్లనఁ దాఁ బశ్చిమవార్థిలో మునిఁగి యు
      ల్లాసంబు నందంగఁ బో
  యెనొ నా భానుఁడు పశ్చిమాద్రిఁబడిపో
      యెన్; బోరె యెవ్వారలున్ ! ౪౨

క. తమయాటలు సాఁగక భీ
తములై మూలలను దాఁగుతమసంబులకున్
సమయ మరుదెంచె దిశల న
లముకొనఁగా నన నవియుఁ జలంబునఁ బ్రాఁకెన్. ౪౩

క. ఇటు లుండు నంధతమసం
బిటు లుండు వివేకహీనుహృది యిటు లుండున్
జటులం బగుపాపాంబుధి
యిటు లుండున్ నరకకూప మెంతయు ననఁగన్. ౪౪

గీ. ప్రాఁకెఁ జీకట్లు దశదిశల్ బారు లమరి
యాక్రమించె లోకంబు ననంతగతుల
నెంతకాలము నిలుచు నేహంత యైన
సౌఖ్య మబ్బదె యనఁ బొల్చెఁ జంద్రకళలు. ౪౫

గీ. తీవ్రముగఁ గాల్చి చంపు నాతీవ్రరశ్మి
చల్లచల్లఁగఁ జంపు నీచంద్రముండు
నింతెభేదము కాని యొక్కింతకరుణ
ముభయులకు లేదనంగను నొలసెఁ దమము. ౪౬

గీ. పిండి యారఁగఁ బోసినవిధము గాఁగ
జ్ఞానకిరణంబు సోఁకినమానసంబు
రీతిఁ దెలిమల్లెపూవులు రిమ్మెనట్లు
జగతి వ్యాపించెఁ జంద్రికల్ సరసభంగి. ౪౭

ఉ. అప్పు డరంధతీసహితుఁ
డై నవసిష్ఠమహర్షి మోదముల్
ముప్పిరిగొన్నరీతి ముని
ముఖ్యుఁడు గౌతమునాశ్రమస్థలిన్
జప్పునఁ దోఁచ గౌతముఁడు
జాయ యహల్యయు భక్తిమీఱఁగా
నప్పరమర్షిఁ బత్నిని న
నంతవిధంబులఁ బూజసేయుచున్. ౭౮

గీ. అర్ఘ్యపాదంబు లిచ్చి సుఖాసనంబు
లిచ్చి హృదయంబు లిచ్చి యహీనమోద
మేదురంబుగ షడ్రసమాధుర మగు
విందుచేసి సుఖావధి నందఁ గనిరి. ౭౯

గీ. అప్పుడు వసిష్ఠగౌతము లతిముదమున
సరససంభాషణంబుల జరపఁ బ్రొద్దు;
నటు లరుంధత్యహల్యలు నతిముదమున
సరససంభాషణంబుల జరిపి ప్రొద్దు. ౮౦

సీ. "కమలగర్భుఁడు మహాకారుణ్యమునఁ గాంచి
యర్మిలిఁ బెంచినయతులఘనత
వాణీమహాదేవి పరమవత్సలతతో
దిద్ది తీర్చినయట్టిదివ్యమహిమ

దేవేంద్రమహిమ ముద్దీపించు గౌతమ
ఋషిఁ జెట్టపట్టిన యిద్ధభాగ్య
మతిలోకసౌభాగ్య మందంగఁ గని పతి
వ్రతలలోఁ గాంచినవైభవంబు

గీ. ఆత్మసామ్రాజ్యసింహాసనాధిపత్య
మందఁ గని సారసంసారమందిరమున
దివ్యదీధితి వెలిఁగెడి దేవి! నిన్ను
సఖి! యహల్యా! నుతింపఁగాఁ జాల నేను. ౫౧

క. మావారు చెప్ప వింటిని
బూవుంబోఁడీ! త్వదీయపుణ్యాఖిల మే
మీవేళ నిటకు వచ్చుట
నీవిపులవిభూతిఁ గాంచి నెగడఁ గనుటకే. ౫౨

క. ఋషికులమునందుఁ బుట్టుట
ఋషికన్యల మగుచుఁ బెరుఁగ నెసఁగుట మఱియుఁ
ఋషిపత్నుల మగుటయు నా
ఋషికృప సొంతంబుఁ గనుట యెంతసుకృతమో! ౫౩

క. నినుఁ జూడఁ దలఁపుపుట్టుట
మనమునఁ దలపోయ నీదుమాన్యతసుమ్మా!
వినుతమహాచారిత్రవు
కనఁగల వఖిలంబు నీవు గౌతమకృప చే. ౫౪

గీ. ఎప్పుడైన నిట్టులు వచ్చి యిటులు పోవు
చుందుదుము మీరుకూడను రండు వేడ్క
నాత్మసంబంధులముకదా యందఱమును"
నని యరుంధతి పలుకఁగా నాయహల్య. ౫౫

క. ముదమొదవఁగ నతిభక్తిఁ
మృదులారుంధతిపదాళి మిగులఁ బ్రియమునన్
మదిఁ గూర్చి మ్రొక్క నాయమ
ముదమునఁ గడుఁ గౌఁగిలించి మూర్కొనె నామెన్. ౫౬

క. అటు గౌతముఁడు వసిష్ఠుఁడు
నిటుల నరుంధతి యహల్య యిష్టసుగోష్ఠిం
బటుసంభాషణముల నా
చటులం బగురేయిఁ గడప సంతసమతులై. ౫౭

క. కలువలు వికసిల్లఁగఁ జెం
గలువలు మోమొత్తఁ జంద్రకాంతము ప్రియతన్
లలిఁ గరఁగి పాఱుచుండఁగ
విలసిల్లి విధుండు విశ్వవిభుతం గనియెన్. ౫౮

క. తారకలు మినుకుమినుకని
తారాధిపుకీర్తిలోనఁ దలఁదాఁచుకొనెన్
గారవపుఁబడఁతు లెల్లరుఁ
బేరిమి మగలందు నునిచి పేరుం గనరే! ౫౯

క. కాలముతో వచ్చును మఱి
కాలముతోఁ బోవుచుండుఁ గన సర్వంబుళ్
కాలముతో వచ్చినశశి
కాలము తీఱంగ నపుడు కసిమసఁగె వెసన్. ౬౦

క. అరుణోదయ రేఖలు పెం
పరయఁగ నరుదెంచె నర్కుఁ డఖిలవిభూతిక్
కరము ముడింగినపద్మము
లరవిచ్చియు మఱియు విచ్చి హాసము చేసెన్. ౬౧

క. మునిపుంగవు లిరువురు నది
మునిఁగి సకలసాంధ్యకర్మములు దీరిచి పెం
పున వచ్చి రవ్వసిష్ఠుఁడుఁ
దనయాలిని గూడి ప్రీతి దయివాఱఁ జనెన్. ౬౨

చ. దినదినవర్ధమాన మగు
దీక్ష మహాతపముళ్ గృహస్థధ
ర్మనిచయనిర్వహాదికము
మాన్యవిధంబున సవ్యసాచియై
యొనరుచుచుళ్ నిరంతరము
నోపిక శిష్యుల బోధసేయుచుళ్
దినములు పుచ్చె గౌతముఁ డ
తీంద్రియబుద్ధి నహల్యతోడుతన్. ౬౩

గీ. ఆత్మశక్తికతంబున నాశ్రమంబు
సకల సస్యసంపన్నమై సర్వసుఫల
వృక్షగణనీయమై పేర్మి వెలయుచుండె
సర్వధర్మంబు లవు డట సాఁగుచుండ. ౬౪

గీ. సంభవించె ననావృష్టి క్షామ మపుడు
సకలసస్యంబులును వినాశంబుఁ గాంచె
వృక్షసంతతులును మోడువిఱిగి పడియెఁ
గాయగూరలు నశియించెఁ గఱవు హెచ్చె. ౬౫

ఆ. వానచినుకు నూడిపడదాయె దివినుండి
యిలను వెలయుజలము లింకిపోయెఁ
దినఁగఁ దిండిలేక జనములు త్రాగంగ
నీరు లేక కనిరి నిఖిలరుజలు. ౬౬

సీ. సద్యోఘృతంబులు శాల్యన్నములు మెక్క-
జనులకుఁ గఱవాయె గునుకులైన
పండ్లుగాయలును సాపడువారికిని గూడ
నాకలంబులు సైత మాయెఁగఱవు
పశుగణంబులు గల్గి పసరెక్క-వారికిఁ
దద్వినాశనమునఁ దగిలె రుజలు
ముప్పూఁటలుం దిని మెప్పు గాననివారు
చిఱుమెతుకులకు వాచిరి మొగంబు

గీ. జారచోరబాధలు పెక్కు సంక్రమించె
నున్నవారలు లేనివా రొక్కటైరి
సకలజనములు క్షుద్బాధఁ జంపలేక
వెకలులైరి దుర్మరణవిభీతు లైరి. ౬౭

ఉ. 'ఆఁకలి యాఁకలో!' యనుచు
నఱ్ఱులు సాఁచుచు నంగలార్చుచున్
గాఁకల కోర్చుచున్ బహుజ
నంబులు కొంపలు గోడు లెల్లనున్
మూఁకలుగట్టి వీడుచును
బోవుచు నుండఁగ నేపదార్థ మ
ట్టాఁకలిఁ బాపఁగో దొరకదు
నా యని యాతురులై క్షుధార్తులై. ౬౮

క. చనె దినములు మాసంబులు
చనియెన్ వర్షములు జనులు చని రెండలో యే
యనువునను గూడ క్షామము
చనదాయెను మఱియుఁ గాంచు సమ్యగ్వృద్ధిన్. ౬౯

క. ఆచెవి నీచెవి గౌతమ
నాచంయమియాశ్రమంబు బహుసస్యశ్రీ
గోచర మని జనములు విని
యాచీమలు గుడముఁ జేరుననువునఁ బ్రీతిన్. ౭౦

క. ఆబాలవృద్ధముగ నా
నాబాధలు పడి జనంబు నలఁగి కలఁగి శో
కాబద్ధాత్మత దైన్య
ప్రాబల్యముతోడ వచ్చి పడ గౌతముఁడున్. ౨౧

క. జనములు గనుబహుయమయా
తనలఁ గని కనులతోడ దయ దయివాఱఁగ
జనములఁ బ్రోవఁగ నోపని
తనతప మిఁక నేల యనెడితాత్పర్యమునన్. ౨౨

ఉ. "ఈనిఖిలావనీజనుల
కింతటినుండి మదీయగేహమే
యాను మహాశ్రయం బిఁక గృ
హస్థుల మేను నహల్యయుఁ గృపా
నూనత సేవచేసి మిము
నోమి తరించెద మిందు రండు రం
డో నిఖిలప్రజల్! కరుణ
నూని" యటంచు సమాదరించినన్. 23

క. పెన్నిధిఁ గాంచిన పేదల
చెన్నున ఘన మగుపిపాసఁ జెందిననరుఁ డా
మున్నీరు చేరినట్టుల
నెన్నఁగ రానట్టిమోద మెనయఁగఁ బ్రజలున్. ౨౪

శా. "మాతండ్రీ! మముఁ గావఁ బుట్టినజగ
న్మాన్యుండవే నీవు ని
న్నే తక్కన్ మఱి మేము నింతటికృపా
వృత్తాత్మునిం గంటిమే?
చేతోజాతము పల్లవించెఁ గృపతో
సిద్ధాన్నముల్ కల్గుచో
నోతండ్రీ! దయఁ బెట్టి కావఁగదవే
యొక్కింత మాప్రాణముల్." ౭౫

మ. అనినన్ గౌతముఁడాని ప్రీతిని నహ
ల్యాసాధ్విఁ బిల్చి "యో
వనితారత్నమ! నీకుఁ గల్గె నిదె సే
వాభాగ్య మత్యంత మీ
జనసంతానము మాన్పఁ దక్షిణమ భో
జ్యంబుల్ ప్రసిద్ధంబుగా
ననువొప్పంగ నమర్చి పెట్టుము క్షణం
బాలస్యముం జేయకే." ౭౬

క. అన విని యానందముతో
నను "వడ్డించెదను జనుల నాసనములపైఁ
బనుపఱుపుఁ" డనియెఁ గాంతయుఁ
దనమంగళసూత్రధారుఁ డానమ్రుటచే. ౭౭

గీ. క్షణములోపల ఋషికులచంద్రుఁ డప్పుడు
 బారులం దీర్చి జనములఁ గూరుచుండఁ
 జేసి విస్తళ్లు వైచి విశిష్టరీతి
 ననునయింపఁగ వందఱు నాక్షణంబ. ౭౮

సీ. కమనీయకదళికాక్రమపత్త్రంబులఁ
 బూతజలంబులచేతఁ జల్లి
 యాపిమ్మటఁ బవిత్ర మైనయాజ్యంబును
 నమలినత్వార్థమై యభిఘరించి
 షడ్రసోపేతభోజ్యంబు లొక్కొక్కటే
 శరవేగమునను విస్తళ్లఁ బెట్టి
 సమధురాహారాదిశాల్యన్నములు పెట్టి
 సమధికం బైనపచ్చళ్లనుంచి

గీ. పిండివంటలు మెండుగాఁ బెట్టి మరల
 నభిఘరించి నివేదన మాచరింపఁ
 డని యెలుంగెత్తి పేర్కొనె నాయహల్య
 యొక్కతయుఁ గోటియువతులయుద్ది వడసి. ౭౯

క. చిత్రప్రతిమలక్రియ నా
 చిత్రంబును జూచుప్రజలు చిత్రం బనుచుం
 జిత్రచరిత్ర నహల్యం
 స్తోత్రించుచుఁ దినిరి కడుపుక్షుధ దీరంగన్. ౮౦

క. బడుగులవడువున నుండుటఁ
గుడిచి బహుదినమ్ము లగుటఁ గోరిక తీఱన్
విడిచి మొగమోట యంతయుఁ
గుడువఁ దొడఁగి రింత కింతఁ గోపుచు మరలన్. ౧౧

క. వేలకు వేలుగఁ బంక్తులు
మేలుగ నైనట్టి ప్రజ కమిత మగుక్షుమత్తో
లోలాక్షి మరల మరలన్
లీలాత్మకభంగిఁ దృప్తి నింపె క్షణమునన్. ౧౨

గీ. ఇట్టివిధమున సాధ్వి తా నెల్ల వేళ
లందుఁ బెట్టుచుఁ దనకీర్తి కందు కుందు
లేక వ్యాపింప మఱియును లీల గాఁగఁ
బతి సవదరించి నడపెడు నతిథిపూజ. ౧౩

శా. భూలోకంబున నున్నసర్వజనులున్
బొల్పొంద నీవార్తకున్
జాలం బ్రీతి వహించి రాఁ దొడఁగి రా
శ్చర్యంబుగా వచ్చినన్
వేలాహీనసముద్రభంగిఁ బెరిఁగెన్
విఖ్యాతమై గౌతమ
శ్రీలావణ్యమహాశ్రమంబు భువిని
ల్చెన్ వచ్చి యట్లక్కడే. ౧౪

క. దినదినమును బెరిఁగెడియా
జనమునకు సమస్తవిధులు సలుపు చహల్యా
వనజానన గౌతముఁడును
గని రతివిస్తారకీర్తి క్షణసంవృద్ధిన్. ౮౫

వ. అహల్యాగౌతము లతిశ్రద్ధావినయాన్వితులై యొన
రించు నతిథిశుశ్రూషలుఁ దత్కారణమున భూలోక
మంతయు గౌతమాశ్రమమై యట నిశ్చింతముగ విం
దులు గుడుచుటయు నందలిభూతలంబు నిత్యసస్యసం
పన్నంబై బహుఫలభరవినమ్రవృక్షశ్యామలమై
నిత్యోజ్జ్వల మగుటయు నహల్యాగౌతముల తాలిమి
మేలిమి శక్తిసంపద త్రిలోకములను వ్యాపింప నొకనాఁ
డింద్రవిఘ్నేశ్వరనారదాదులు మాయాబ్రాహ్మణ
వేషధారులై గౌతమాశ్రమభూములం జేరి రాత్రి వేళ
నొకచోఁ గూరుచుండ గాఢనిద్రావస్థ నున్న జనం
బులు : ౮౬

గీ. "అఖిలసంపన్న మాయె మహానుభావ!
ఇంక వల దింక వలదు మా కేమి యైన
బహుళతృప్తి ఘటిల్లె నీప్రబలకరుణఁ
గడుపు చల్లగ వఱలుము ఘనమునీంద్ర!" ౮౭

క. అని కలవరించుపురుషుల
ఘననిద్రావస్థఁ గాంచి కౌతుకమతులై
వనితాజనములపజ్జల
కును జన వినఁ బడియె నిట్టికోమలపదముల్. ౮౭

గీ. "పరమతృప్తి ఘటిల్లె నంబా! యహల్య!
ఇంక వల దింక వలదు మా కేమి వలదు
గడుపు చల్లగ వఱలుము కన్నతల్లి!"
యని కలవరింపఁ దొడగిన నచ్చెరువడి. ౮౯

వ. వారు మఱునాఁడు బహుళోదారపదార్థములు భుజింత
మనియు నందువలనఁ దమకుఁ బెట్టలేక యహల్యా
గౌతము లేమగుదురో చూతమనియువారెంచి మఱు
నాఁటి భోజనవేళ వారు ప్రజాపంక్తులలోఁ గలసి
పోయి సహస్రసంఖ్యానీకము తినుపదార్థనిచయంబు
నొక్కరొక్కరే తినుచుండ వారిని గౌతమమహర్షి
దివ్యదృష్టిఁ గనిపెట్టి : ౯౦

గీ. "నన్ను నోడింప వచ్చి రీమిన్న!" లనుచు
నాత్మశక్తిప్రభావంబు నధికపఱచి
యెంత తిన్నను వారల కింకఁ బెట్టఁ
బాటిపోయిరి కడుపులు బ్రద్దలైన. ౯౧

క. ఇటులు పరిభవము నందుచు
నటు లప్పుడు వారు పాఱి నాగణపతియుక్
బటుతరమాత్సర్యముతోఁ
జటులం బగుయుక్తి పన్ని సాధించుమతిన్. ౨

గీ. తిరిగి గౌతమాశ్రమభూమిఁ దరియఁజొచ్చి
కపటగోవును సృజియించి గౌతమాశ్ర
మంబు మేయఁగఁ జేసె; క్షణంబునందు
గౌతముఁ డదల్ప నది కనెఁ గాలగతిని. ౩

ఉ. అంతట సర్వమానవులు
"నక్కట! యీముని యావుఁ జంపె నీ
ప్రాంతమునందు నుండఁ గడుఁ
బాప" మటంచుఁ దృణీకరించి యొ
క్కింతయు జాలి లేక ముని
నెంతయుఁ దిట్టుచు లేచిపోయి రా
జంత వినాయకుక్ బడసి
క్షామము పాయ ననూయపెంపునన్. ౪

గీ. "తప్పిదము సైఁచి నిలువుఁడు, తత్క్షణంబు
దోషపరిహార మొనరించి తొలఁచుకొందు
దోషము నుపాయమును దెల్పి తోడు కండ"
టనుచు గౌతముఁ డెలుఁగెత్తి యడిగినంత. ౫

గీ. కపటవిప్రోత్తముండు విఘ్నపతి పల్కె
"మానిచంద్రమ! శివుఁ గూర్చి పూని తపము
జాహ్నవిని దెచ్చి యీప్రదేశంబునందుఁ
బాఱఁ జేసితివేని రూపఱు నఘంబు." ౯౬

క. అని పలికి సకలజనములఁ
గొని చనె గణనాయకుండు గొబ్బున మునియుఁ
దన దైవదివ్యదృష్టిని
గనుఁగొనఁగాఁ దప్పిదంబు గాన్పించె నిటుల్. ౯౭

సీ. "పార్వతి తనయుని వత్సలత్వముతోడఁ
బిలిచి నాయన! నాకుఁ గలదు సవతి
గంగమ్మ యామెను జెంగున భూమికిఁ
బోవఁజూచితివేని పోవు నాకు
మానసికవ్యథ మానవుల్ ధన్యులై
పరమపవిత్రులై పరగఁగలరు
గౌతమఋషి యొక్కఁడే తగు నింతకు
నతనిచేఁ జేయింపు మంతపనియు"

ఆ. ననుచుఁ బలుకఁ దల్లి ననునయించి వినాయ
కుండు కుట్ర పన్నుకొనుచుఁ జనియె
జనుల నెల్లఁ గొనుచు సరగున"నని తోఁప
గౌతముండు పరమకౌతుకమున. ౯౮

చ. పరమశివుఁ బ్రసాదింపఁ జేయుటయుఁ
భావని జాహ్నవిఁ దెచ్చుకొంటయున్
గరము మదిష్టమే యగును
గావునఁ జేయుదు దేవకార్యమున్
గరుణ యొకింత లేక ననుఁ
గారియవెట్టిరి నీచమానవుల్
బరగ ననూయఁ బాపు" లని
భార్యను బిల్చి సమస్త మేర్పడన్. ౯౯

గీ. తెలిపి యాశ్రమభూమిని నిలిచి మౌని
తత్క్షణము తొడఁగెఁ దపో వ్రతంబు నూనఁ
బరమశివు నర్చచేసెడిభాగ్య మబ్బె
ననుమహానందమే హృదయంబు కాఁగ. ౧౦౦

సీ. హృదయబంభరము మహేశపాదాంబుజ
సాంగత్యసౌఖ్యంబు సవదరింప
నేత్రఝషంబులు నిరుపమశివసరో
వరమున గంతులు వైచుచుండ
బాహుపద్మంబులు పరమేశునురుతర
చరణపద్మంబులఁ జాఁగి మ్రొక్కఁ
ద్రికరణంబులు మహాదేవసుహృద్వశీ
కరణంబులై యొండు కోసకుండ

గీ. సకలపరిచర్యలు నహల్య సలుపుచుండు
    టెఱుఁగకుండ మహేశ్వరు నెద భజించు
    నుగ్రతపమున జగము లుబ్బాఁత లూఁగ
    గౌతమతపస్సు నిర్విఘ్నకలిత మయ్యె. ౧౦౧

ఉ. ఆయమిశేఖరుండు పర
        మాత్మపదంబులు ప్రస్తుతించుచోఁ
    బాయని వేడ్కఁ నాశ్రమశు
        భప్రదదేశము సర్వముణ్ "మహే
    శాయ! నమశ్శివాయ! యజ!
        శాశ్వత! రుద్ర! కపాలపాణి! శ
    ర్వాయ! నమోనమో!" యనుచుఁ
        బల్కఁ నిరంతర మేకదీక్షతో. ౧౦౨

ఆ. ఆకు రాలు వేళ నగు శివశబ్దంబు
    చీమ చిటుకు మన్న శివునిస్మరణ
    శబ్ద మేఁగుదెంచు సర్వాశ్రమం బగు
    శివశివాత్మకంబు శివమయంబు. ౧౦౩

ఉ. గౌతమమౌని యొక్కఁడుఁ బ్ర
        గాఢహృదంతరదివ్యశక్తిచేఁ
    బూతతపోగ్రతణ్ భుజగ
        భూషణు నొక్కని మేషమాత్ర ము

ద్యోతితభక్తరక్షణమ
హోన్నతి నేమఱనీయఁ డయ్యె వి
ఖ్యాతశశాంకశేఖరుఁడు
గ్రక్కునఁ దోఁచె మునీంద్రుముంగిటన్.

చ. కరములు మోడ్చి గౌతముఁడు
గాఢమహోన్నతభక్తియుక్తి నా
పరమశివుఁ పదాబ్జముల
వ్రాలి నుతింపఁ దొడంగె "నీశ! యో
కరివరచర్మధారి! కఱ
కంఠ! శివా! యజ! పార్వతీధవా!
శరణము కావవే! ననుఁ బ్ర
సన్నత శర్వ! యుమామహేశ్వరా!

గీ. స్వామి! భవదీయదివ్యదర్శనమువలనఁ
బరమమాన్యత ఘటియిల్లె బ్రతుకుఫలము
సంఘటిల్లె మహాదేవ! జాహ్నవి నిటఁ
బాఱఁజేసి మనోరథప్రాప్తి నిమ్మ. ౧౦౬

గీ. దేవదేవ! మహాదేవ! పావనాంఘ్రి
యుగళ! నీ వెఱుంగనిదొక టున్నె? శర్వ!
మన్మనోభీష్టముం దీర్చి మనిచి నన్నుఁ
గరుణఁ జూడుము నీవానిఁగా మహేశ!". ౧౦౭

మ. అని ప్రార్థించినఁ బార్వతీరమణుఁ డ
    త్యానందసంధాయియై
"మునిచంద్రా! కడు సంతసించితి భవ
    న్ముఖ్యాశయం బీమహా
జనలాభార్థముకాని స్వార్థ మది లే
    శంబైన లే దిందు వ
త్స! నిరీహున్ నినువంటివానిఁ గనఁగా
    సాధ్యంబు గా దెయ్యెడన్. ౧౦౮

గీ. పరగు జాహ్నవి నీపేర ధరణియందుఁ
బరమమాన్యుఁడ వైతివి వత్స! నీవు
తల్లిగా జాహ్నవిని గొల్వఁ దరలివచ్చు
నామె, శుభములు నీ కగు" నని శివుండు. ౧౦౯

క. అంతర్ధానము చేసిన
యంతఁ గౌతముఁడు మిగుల నానందముతో
సంతతకరుణాకరశివ
కాంతన్ జాహ్నవి నుతించెఁ గడు భక్తిమెయిన్. ౧౧౦

శా. "అమ్మా! జాహ్నవి! భక్తవత్సలత నీ
    కాప్యాయమాఁ గాదె! కై
కొమ్మా! మత్కృతవందనాదులఁ గృపాం
    కూరంబు తోరంబుగా

రమ్మా ! తల్లి ! పవిత్రవంతము నౌన
ర్వక్ష భూమి సర్వమ్ము శీ
ఘ్రమమ్మ నాపయిఁ జూపు వత్సలత శం
కాతంక మింకేటికిన్. ౧౧౧

సీ. జీవనదంబవై జీవనదంబవై
కృపఁజూడు భూలోకకృపణజనుల
నారదాయిని వౌచు నారదాయిని వౌచు
భుక్తిముక్తులఁ బ్రోవు భువిజనముల
నమృతంబు నొసఁగియు నమృతంబు నొసఁగియు
గరుణఁజూడు భవాని నరగణముల
నమృతాధివాసమ వమృతాధివాసమ
వై యొసంగుము మాకు నమృదపదవి
గీ. కలితదివ్యప్రభావ గంగా ! భవాని !
కల్పవృక్షమ వైనగంగా ! భవాని !
కలిమలాపహ వైనగంగా ! భవాని !
కంగుననురమ్మ దివిజగంగా ! భవాని ! ౧౧౨

క. గంగా గంగా యని యీఁ
గంగాఁ గనుఁ గలుషరాశిఁ గడుఁ గష్టుండున్
గంగా! భవాని ! నీకృప
నుం గనునాభాగ్య మెట్టిదనుతి కర్హాంబో". ౧౧౩

మ. అని ప్రార్థించిన భక్తవత్సల కృపా
హర్షాత్మ గంగమ్మ యా
మునిశార్దూలు సమీపభూమి కతిసాం
గోపాంగయై ఫేనహా
సనిమగ్నంబుగ ఘోరనాదములతో
సవ్యాకృష్టన్ బాఱుడెం
చెను, లోకోపకృతుల్ మహామహులకున్
జెన్నారు సాజంబులై. ౧౧౪

క. గౌతమముని బహుసంస్తుతి
పూతాత్మత గోపుచన్నభూమిఁ దడపఁగా
నాతల్లియు 'గౌతమి' యన
స్రోతస్విని యయ్యె నిఖిలశోభ యెసంగన్. ౧౧౫

క. అంతట గౌతముఁ దిట్టిన
జంతలు విశ్వాసహీనచరితులు మూర్ఖుల్
సంతసమున స్నానార్థము
ప్రాంతమునకు రాఁగ గంగ యతిరభసమునన్. ౧౧౬

క. అంతర్ధానముచేసిన
యంతఁ గౌతముఁడు మరల నంబను మిగులన్
జింతఁ బ్రార్థించెఁ గృపా
స్వాంతంబునఁ దన్నుఁ బ్రోచి పాఱఁగ మరలన్. ౧౧౭

ఉ. "నిన్నుఁ బరాభవించి కడు
నింద్యులు నైనజనుల్ కృతఘ్ను లీ
నన్నను దాఁక వచ్చిన మ
నంబునరోఁత జనించెఁ బాపు ల
న్నన్న! భరింపఁజాలను దు
రాత్ములఁ గాన నదృశ్యనైతి నీ
వెన్నకు దోష" మంచుఁ బర
మేశ్వరి పల్కె నదృశ్యమానయై. ౧౧౮

చ. అది విని గౌతముండు "కృప
నంబ! శమింపు మదర్థమై కృపా
సదని! జనాళి తప్పిదము
సైఁపుము సైఁచి యనుగ్రహింపుమీ!
సదయతఁ బాలు దెమ్మ కడు
సంతసముం బొనరింపు మమ్మ! న
న్నదవద సేయకమ్మ!" యని
సాంజలియై కడు వేఁడుచుండఁగన్. ౧౧౯

క. కరుణాసమంచితం బగు
నురుచిత్తముతోడ గంగ యొయ్యనఁ జనుదెం
చి రయంబున మునుపటివలెఁ
గరమధికము గాఁగఁ బాలుఁగాఁ జొచ్చె దయన్. ౧౨౦

సీ. సర్వజనంబులు స్నానంబు లొనరించి
గౌతమి స్తుతియించి క్రమభంగిఁ
దమదోషపరిహారణమునకు గౌతము
పాదంబులం బడి "పావనాత్మ!
క్షమియింపు క్షమియింపు క్షమియింపు తప్పులు
విశ్వాత్ముఁడవు జ్ఞానవిదుఁడ వీవు
లోకహితార్థివై భీకరక్షామంబుఁ
బాపి రక్షించినపరమపురుష!

గీ. నీ వొనర్చినయుపకారనిచయములకు
నే మొనర్చినయపకృతు లెల్ల మఱచి
కరుణఁజూడుము, ప్రబలాపకారులకును
జేసితి మహోపకారముల్ చిత్తశుద్ధి." ౧౨౧

క. అని బహువిధముల వేఁడఁగ
మునిచంద్రుఁడు "పుణ్యులార! ముద మొదవెను మీ
ఘనకృపచేఁ గద నేమును
గనఁగంటిని శుభము పొందు కరుణాళువులై." ౧౨౨

క. అన నెల్లరు గౌతమమునిఁ
గొనియాడుచుఁ జనిరి పిదపఁ గుతుకము మీఱన్
ముని యింటికరితెఁ గడుఁ బ్రే
మను బిల్వ ముదంబు మీఱ మధురమృదూక్తుల్. ౧౨౩

గీ. సకలవృత్తాంతమును బరస్పరముఁ జెప్పు
కొని సుఖించి రయ్యిరువురుఁ గొంత సేపు
నతులితానందులై రి దంపతు; లహల్య
పతిని గీర్తించెఁ బిమ్మట బహుముఖముల. ౧౨౪

శా. "ఆనందం బొదవించినావు తరుణీ!
యత్యంత మస్మద్గత
ధ్యానానూనసపర్యలన్ వరము నే
దైనం బ్రసాదింతు నా
కానందం బొదవింపఁ గోరుకొని" యం
చానందియై మౌని య
య్యానందాంబుధి నంకభాగమున కా
హ్వానించెఁ బ్రేమంబునన్. ౧౨౫

క. "ఇవి యేటివి? క్రొత్తలు మీ
ప్రవిమలపాదార్చనంబె బ్రహ్మానందం
బవు" ననుచును బతితోడఁ బై
నువిద యధిష్ఠించె భక్తి నుత్తమఫణితిన్. ౧౨౬

క. "పలుకుము నీకోరిక యో
కలికీ!" యని యడుగ మునియుఁ గాంతయుఁ గోరెన్
కులదీపకుఁ డగుకొమరునిఁ
గులదీపని యైనయొక్కకూఁతుర్ భక్తిన్. ౧౨౭

ఉ. "కామిని ! కోరఁగాఁ దగిన
కామ్యము కోరితి సంతసంబు ని
న్నిమతిఁ జెట్టపట్టితిని
నింతి ! గృహస్థులు పుత్త్రసంపదన్
గోమలమానసంబులను
గోరుచు నుండుట తప్పుగాదు దే
వీ ! మమకారదోషమును
వీడినవిమ్మట నాత్మవేదులై. ౧౨౮

క. అహరహమోహంబును దు
స్సహకామముఁ బశుగుణంబు సంయమము సతీ !
బహుపుణ్యులకే యగు మన
విహరణమునఁ దప్పు లేదు ప్రియ మగు నీకున్." ౧౨౯

చ. అని కరుణన్ మునీశ్వరుఁ డ
హల్యకుఁ గాలగతిన్ మనోహరాం
గుని సుకుమారు నొక్కని న
కుంఠితతేజు ననుగ్రహింప నా
ప్పను నతఁ డాగమజ్ఞుఁ తఁ ద
పోధనతన్ బహులోకపూజ్యుఁడై
వినుత యశస్వియై పరమ
విశ్రుతతత్త్వవిశారదుండునై. ౧౩౦

క. అతఁడె శతానీకుం డన
నుతికెక్కెఁ జగములందునుం బిమ్మట స
త్సతి యైనయహల్యకు నా
సుతపసి యనుగ్రహించె సుత నొక్కరుతన్. ౧౩౧

ఆ. అంజనాఖ్య నామె యతివిశ్రుతఖ్యాతిఁ
గాంచి కనియె హనుమఁ గ్రమభంగి;
నిటు లహల్య వెలసె ఋషికులతిలక చే
దివ్యసంతతిఁ గని భవ్యభంగి. ౧౩౨

ఉ. పూతచరిత్రదివ్యఋషి
పుంగవగౌతమధర్మపత్న్యహ
ల్యాతరుణీమణీచరిత
మాదృతి విన్న సమస్తపాపముల్
వీతము లౌ లభించును న
భీప్సితముల్ బహుభంగులఁ మహా
ఖ్యాతచరిత్ర మబ్బును బ్రి
యంబగు దీనిఁ బఠించి మెచ్చినన్." ౧౩౩

క. అని సూతుఁడు వినిపించిన
విని యానందమునఁ దేలి విలసిల్లిరి పా
వను లగుమును లెల్లరునుం
గొనియాడి రహల్య గౌతముం గడుభక్తిన్. ౧౩౪

చ. వినుతచరిత్ర ! విశ్రుతవి
వేక ! మహామహా ! దేవదేవ ! చి
ద్ఘనరుచిరాత్మరూప ! బహు
క్రమశరీర ! మహాత్మ ! దేవ ! పా
వనబహుశాస్త్రభూషణ ! ప్ర
భావనిధీ ! గురుదేవ ! దేవదే
వనవనవాద్భుతార్యగుణ
వర్ధిత ! మోహితరూపమన్మథా ! ౧౩౫

క. మునిలోకగ్రామణి ! పా
వనచరితా ! త్రిభువనాత్మపరిపాలక ! స
జ్జనగణమందారా ! ప్రా
క్తనదివ్యతపః ప్రకాశ ! తత్త్వజ్ఞనిధీ ! ౧౩౬

—: మంగళమహాశ్రీవృత్తము :—

పావనమహార్యజన
భావిత ! లసద్గుణశు
భంకరతపోధన ! మహాత్మా !
దేవకులభూషణ ! సు
ధీవినుత ! సర్వగుణ
దీప్త ! కరుణాభినుత ! సద్భా

దేవకుల శేఖర ! య
తీంద్రగణమాన్య ! ఖల
ధిక్కృతవిహార ! పరమాత్మ !
ప్రోవుము నిరంతరముఁ
బాల్పెసఁగుముక్తి నిడి
పూర్ణకృప మంగళమహాశ్రీ !

గద్యము. ఇది శ్రీగురుకటాక్షలబ్ధకవిత్వ గౌతమసగోత్రపవిత్ర బులుసు వేంకటేశ్వరప్రణీతం బైన శ్రీమదహల్యా గౌతమమునఁ దృతీయాశ్వాసము.

సంపూర్ణము.

---

కాకినాడ : మాస్టర్‌మన్ ముద్రాశాలయందు ముద్రింపఁబడియె.